# కట్టు తెగిన పిల్ల

శరత్ బాబు

శరత్ గ్రంథమాల
విజయవాడ - 2

# కట్టు తెగిన పిల్ల

"చిన్నత్తా! మాఅమ్మ మహాప్రసాదం పంపించింది- తీసుకో"

"ఎవరదీ? అతులుడా? రా. నాయనా! రా" అంటూ దుర్గామణి యింట్లోంచి బైటికివచ్చింది, అతులుడు ఆమె పాదాలకు ప్రణమిల్లాడు.

"ఆయుష్మాన్‌భవ! ఆరోగ్యవాన్‌భవ! —ఒసేయ్, జ్ఞానదా! మీ అతులుడు బావ వచ్చాడే. ఒకచాప తీసుకువచ్చి వేసి, ఈ మహాప్రసాదం తీసుకు వెళ్ళు అమ్మా! నిన్న రాత్రి తొమ్మిదిన్నర-పదిన్నర ప్రాంతాలప్పుడు వీధిలో గుర్రబ్బండి చప్పుడు విని ఎవరువచ్చారా? అని అప్పుడే అనుకున్నాను. మా వదినగారు వచ్చిందని అప్పుడే కనుక తెలిసినట్లయితే పరుగెత్తుకెళ్ళి పాదాలకు నమస్కరించి వచ్చేదాన్ని. ఆలాంటి మనిషి నిజంగా జగత్తులోఉంటుందీ అసలు! ఆ. అన్నట్టు వదిన కులాసాగాఉన్నదా నాయనా? ఇప్పుడు పూరీనుంచే అనుకుంటూ ఈ రానటు! ఏంచేస్తున్నావే అమ్మాయీ! మీ బావ నుంచునే వుండిపోయాడే!"

తల్లి పిలుపువిని పన్నెండు-పదమూడేళ్ళ నల్లటిఅమ్మాయి చేత్తో చాపఒక : తీసుకుని గదిలోంచి బైటికివచ్చింది. వచ్చి, వీలైనంతవరకు తలవంచుకొని, వసారాలో చాపపరచి, అతు

లుడి దగ్గరకువచ్చి, అతడి పాదాలకు నమస్కరించింది. ముఖం ఎత్తిచూడనూలేదు, పెదవివిప్పి మాట్లాడనూలేదు. నమస్కరించి లేచి ఆ ప్రసాదం తీసుకుని మెల్లిగా వెళ్ళిపోయింది. కాని కొంచెం పరీక్షగా చూస్తేమాత్రం వెళ్ళేప్పుడు ఆ పిల్ల దాని ముఖంలో, కళ్ళల్లో అణచుకున్న నవ్వు కొంచెంగా పైకి తొణికిసలాడటం కన్పించేదే.

అయితే ఒక్క ఆ అమ్మాయేకాదు. ఆదృష్టిని కొంచెం యిటుకూడా ప్రసరింపచేస్తే సుందరమైన ఆ యువకుని ముఖం మీంద నాట్యంచేస్తున్న కాంతి ఒక అదృశ్య విద్యుత్ ప్రవాహంలో ఒక్క నిమిషంలో మిళితంమైపోవటంకూడా కన్పించేదే.

అతులుడు చాపమీదకూర్చుని తీర్థయాత్రావిశేషాలు చెప్పటం మొదలెట్టాడు. అతడితండ్రి పూర్వం సబ్‌జడ్జీగా ఉండేవాడు. చాలా ఆస్తీ, డబ్బూ కూడబెట్టి-రిటైర్ అయి, కొన్నాళ్ళు పెన్షన్‌కూడా పుచ్చుకున్నాడు. ఆయన చనిపోయి నాలుగేళ్ళయింది. బి. ఏ. పరీక్షలు అయిపోగానే అతులుడు తల్లిని వెంటపెట్టుకొని తీర్థయాత్రలకై బయలుదేరాడు. రామేశ్వరం, పూరీజగన్నాథం చూచుకుని నిన్ననే యింటికి తిరిగి వచ్చాడు.

దుర్గామణి ఆ కబుర్లన్నీ విని ఒక్కసారి — నిట్టూర్చి "నేనెంత మహాపాపాత్మురాలినో నాయనా? అన్నిటిమాటా అలావుంచు, చివరకు కాశీవెళ్ళి విశ్వేశ్వర దర్శనమయినా చేసుకుని వద్దామనుకుంటే-అదీ ఈజన్మకుపడిందికాదు" అన్నది.

"కాశీకి అయితేనేం, మరెక్కడికయితేనేం, ఒక్కసారి అన్ని అవాంతరాలనూ తప్పించుకుని బైటపడలేకపోతే మాత్రం ఏదీసాగదు. నేను ఇలా బలవంతంచేసి తీసుకువెళ్ళక పోయినట్లయితే మా అమ్మమాత్రం ఈ యాత్రలన్నీ చేయ కలిగేదా అత్తా ?"

దుర్గామణి మరొకసారినిట్టూర్చి, "నాకు అన్నీ తెలుసు నాయనా ! ఏంచూచుకుని బలవంతాన బైటపడేది చెప్పు. ముప్ఫైరూపాయల జీతంలో సంసారం—భోజనమూ ఖర్చు పోగా, డాక్టర మందులకూ మాకులకు పోగా, ఇంకా ఏం మిగులుతుంది చెప్పు ? ఈ పిల్లని చూద్దామా దీనికి అప్పుడే పదమూడోయేడు కూడా వచ్చేసింది. నీకు నిజంచెబుతున్నా నాయనా! దానిముఖంకేసి చూస్తే ఏమిటో నాగుండెలు గుబ గుబలాడి రక్తం గడ్డకట్టుకుపోతుంది ఉన్ ! ఇంత పెద్ద శత్రువును కూడా నవమాసాలూ మోసి, కని పెంచవలసి వచ్చింది కదూ !" అన్నది.

ఈమాటలు అంటూంటే ఆమెకళ్లు జల జల లాడాయి. కాని ఆశ్చర్య మేమంటే ఆమె బెంగతో ఇన్నికాతరోక్తులు పలికినా ఆతడు ముఖంఎదుటే కొంచెంగా నవ్వి, "అత్తది మరీ ఓఘాయిత్యం! కాస్తని గంపంత చేస్తుంది. ఆడపిల్లలు ఇంక ఎవరికీ లేరూ, నీ కొక్కదానికేనా?" అన్నాడు.

"నాకిది కేవలం దిగులుకాదు అతుల్ ! మరణబాధ ఇది నాకు. సమాజంసంగతి నాకు తెలుసుగా! కూతురిపెళ్ళి చేయలేకపోతే కులంపోతోంది. కాని ఎలాచెయ్యను? డబ్బు కావాలి–కాని ఎక్కడనుంచి వస్తుందీ నాకు ? ఈ యింట్లో

భాగం మినహా 'నాది' అనే చెప్పుకునేందుకు మాకు ఏమీ లేదు నాయనా !" అన్నది దుర్గామణి.

అరగంటక్రితమే కూతురి విషయమై భార్యా భర్తలకి పోట్లాట జరిగింది. భర్త భోజనం చేస్తున్నవాడల్లా మధ్యలోనే విస్తరి విడిచిపెట్టి లేచి ఆఫీసుకు వెళ్ళిపోయాడు. ఆ బాధ దుర్గామణి మనస్సును కల్లోల పరుస్తోంది. కళ్ళలోంచి అశ్రువులు జలజలా చెక్కిళ్ళ మీదనుంచి జారి టపటప ఒళ్ళో పడుతున్నాయి. చేత్తో కన్నీళ్ళు తుడుచుకుని, "క్రిందటి జన్మలో ఎన్ని స్త్రీహత్యలూ, బ్రహ్మహత్యలూ చేశానో నాయనా? ఈ జన్మలో ఆడపిల్లను కన్నాను" అన్నది.

"అలాకాదు అత్తా! నేను లేచి వెళుతున్నాను. లేక పోతే నువ్వు ఆగేట్లులేవు" అన్నాడు అతులుడు.

దుర్గామణి మరోసారి కళ్లుతుడుచుకుని "వద్దునాయనా! లేవొద్దు ఒక్కసారి కూర్చో. రెండునిమిషాలు నీ ముందర కళ్ళనీళ్ళు పెట్టుకుంటే నా హృదయం తేలికపడుతుంది. అందు కనే, "భగవాన్! దాన్ని నాకడుపున పుట్టేట్టుచేసిన వాడివి-కాస్త రంగుఅయినా తెల్లగా ఉండేట్లు చేయకుండా నల్లగా ఎందుకు పుట్టించావ్ ?" అని అనుకుంటూ ఉంటా, నల్ల పిల్ల అని దానికి ఎవరూ ఆశ్రయం ఇవ్వటానికి ఇచ్ఛగించటం లేదు. అందరూ అందమైన పిల్లకావాలని కోరుకునేవాళ్ళే! ఛీఛీ దౌర్భాగ్యసమాజమా! నువ్వు కులాన్ని—శీలాన్ని—గుణాన్ని దేనినీ చూడకుండా—కేవలం నలపిల్ల అనే కార ణంతో దానికి ఎక్కడా ఆశ్రయం దొరక్కుండాచేస్తే—మరి

దానికి పెళ్ళిచేయలేక పోయారని తలిదండ్రులను శిక్షించ బోవటం దేనికి?" అన్నది.

"నల్లపిల్ల అయినంతమాత్రాన ఏం పెళ్ళికాదా? తుమ్మెద నల్లనిదికాదూ? కోయిలమాత్రం నల్లగావుండదూ! వాటికి ఆదరంలేకుండా పోతోందా! ఇవన్నీ ఆదినుంచీ మనకు కన్పిస్తున్న దృష్టాంతాలేగా అత్తా!"

"ఆ దృష్టాంతాలుమాత్రం శాశ్వతంగా అలా నిలిచి ఉన్నాయి. అంతకన్న ఇంకేంలేదు నాయనా! ఆమాటలవల్ల సాంత్వనా లభించదు. మనస్సుకు శక్తికలగదు. అతుల్. గిరీశ భట్టాచారిగారి కూతురుపెళ్ళి కళ్ళారా చూచినప్పటినుంచీ కాళ్ళుతీసుకెళ్ళి కడుపులో దాచుకున్నట్టుగావుంది నాస్థితి. అక్కడా సరిగ్గా ఇంతే మాలాగా-వాళ్ళకి ధనబలమూలేదు. ఆ అమ్మాయికి సౌందర్యబలమూలేదు. అంచేత ఆ వరుడు అరవైయేళ్ళవాడు వచ్చాడు! ఆపిల్లదానితల్లి ఏడుపు ఇప్పటికీ నాచెవుల్లో గింగురుమని విన్పిస్తోంది అతులీ!"

అతులుడు ఆశ్చర్యపోతూ "అరవైయేళ్ళా? ఏమిటి నువ్వన్నదీ?" అని అడిగాడు.

"అంతకాక మరింకేమిటి నాయనా? ఆ వీధిని ఉండే నితాయిచటర్జీ హరిచక్రవర్తి మనుమరాలి మొగుడు. ఆ నితాయికి పదేళ్ళ కూతురుఉండేదే! ఆలెక్కనచూడుపోనీ ఎన్నేళ్ళో!

ఆమాటవిని అతులుడు స్తబ్ధుడై అలాగే చూస్తూ ఊరుకున్నాడు.

"ఆపిల్లది మనస్సుకు విరక్తికలిగి ఒకవేళ విషం మ్రింగిందన్నా - కంఠానికి ఉరిపోసుకున్నదన్నా - వంశానికి

అప్రతిష్ఠ తెచ్చి లేచి చక్కాపోయిందన్నా-కన్నతల్లి అయి దాన్ని మనస్ఫూర్తిగా ఎలా దూషించగలదో చెప్పు నాయనా?" అన్నది మళ్ళీ దుర్గామణి.

అతులుడు మెదలకుండా ఊరుకున్నాడు.

దుర్గామణి హఠాత్తుగా అతడి రెండుచేతులూ పట్టు కొని "నాయనా అతుల్! ఈరోజుల్లో మీలాంటి యువకు ల్లోనే ఇంకా దయాధర్మా లున్నాయని అంటారు అంతా. మీ కాలేజీ విద్యార్థుల్లో ఎవరైనా కేవలం దయతలచి ఈ పిల్లదానికి తమ పాదాలచెంత రవంత ఆశ్రయం ఇస్తారేమో చూడు బాబూ? అలా అయితే ఆమరణాంతం కృతజ్ఞురా లినై ఉంటాను నీకు" అన్నది.

అతులుడు కంగారుపడుతూ చేతులు వెనక్కిలాక్కొని ఆమె పాదాలకు నమస్కరించి, ఆర్ద్రకంఠంతో "ఎందుకింత ఆదుర్దా పడతావ్ అత్తా? నేను మాటఇస్తున్నానుగా—"

కాని ఆమాట ఇవ్వలేక పోయాడతడు. చటుక్కున లజ్జతో అతడిముఖం ఆకర్ణాంతం ఎర్రనై కంఠం బిగుసుకు పోయింది. దుర్గామణి అది గమనించక పోవచ్చు. కాని మరిం కెవరయినా అక్కడ ఉన్నట్లయితే అతులుడు ఏదో ఆవే శంలో చెప్పబోయి చటుక్కున ఆగాడని గ్రహించేవాళ్ళే.

అతులుడు తనను తాను కుదుటపరచుకుని లేచి నుంచుని, సహజమైన ధోరణిలో "సరే, శాయశక్తులా ప్రయత్నిస్తాను. ఎక్కడున్నావే జ్ఞానదా! కాస్త తాంబూలం అదీ ఇయ్యి—ఇంటికి వెళ్ళాలి" అన్నాడు.

దుర్గామణి కొంచెం కోపం తెచ్చుకుని "మీ బావకి కాస్త తాంబూలం ఇవ్వరాదుటే జ్ఞానీ! దౌర్భాగ్యపుముఖం దానికి అందం లేనందుకు తగినట్లుగా నే గుణాలూ లేవు. అయినా నాకు తెలియక అడుగుతాను, ఇలాంటి సంగతులన్నీ ఒకరు నేర్పాలా? ఆ ప్రసాదం తీసుకెళ్ళి ఆ గదిలో దూరింది. అంతే మళ్ళీ యివతలికి రాకనేపోయె! చవ్వన తాంబూలం తీసుకురావేమే!" అన్నది.

"సరే, నేనే పోయి తెచ్చుకుంటాలే తాంబూలం. ఏ గదిలో ఉన్నావే జ్ఞానీ?" అని బిగ్గరగా పిలుస్తూ అతులుడు పడకగదిలోకి వెళ్ళాడు.

ఎదురుగా తమలపాకుల సజ్జపెట్టుకుని మెదలకుండా కూర్చునివుంది జ్ఞాని. అతులుడు గదిలోకి వస్తూనే గంభీరంగా "దౌర్భాగ్యపు ముఖంది—జ్ఞానికి అందం లేనందుకు తగినట్లుగానే గుణమూ లేదు అని అన్నది అత్త. దానికి అరవై యేళ్ళ ముసలివాణ్ణి ఒకణ్ణి తెచ్చి కట్టాలి" అన్నాడు.

జ్ఞానదా జవాబు చెప్పలేదు. తలవంచుకుని తమలపాకుల సజ్జలోంచి రెండు ఆకులు తీసి చేత్తో అందివ్వబోయింది.

అతులుడు వెనకాలగా వచ్చి ఆమె చేతిలోని తమలపాకులు తీసుకుని "కాని తమలపాకు చిలకలు సరిగ్గా అందిస్తే మాత్రం క్షమించుతాం. అరవై యేళ్ళవాడికి బదులుగా ఇరవై, ఇరవై రెండేళ్ళ వాడిని తెచ్చి కడతాం" అన్నాడు.

జ్ఞానదా సిగ్గుతో తల తమలపాకుల సజ్జలోకల్లా వంచుకుంది. అతులుడు గొంతుకొంచెం తగ్గించి "ఇంకాస్త అయి

నచ్చితే అత్తతో చెప్పేవాడ్నే. సరే, వేళ మిగులుతోంది. వెళుతున్నా" అన్నాడు.

జ్ఞానదా ఈ మాటకూ జవాబు చెప్పలేదు. శరీరమంతా కుంచించుకుని, అలాగే తల వంచుకుని కూర్చుంది.

"సమాధానం చెప్పవా యేం? సరేలే" అంటూ అతులుడు ఆమె తడిజుట్టును ఒకప్రక్క పట్టుకుని లాగి "కాని వస్తున్నాడులే—హరి చక్రవర్తిలాంటి ముసలివాడు— వెళుతున్నా" అంటూ నవ్వుతూ గదిలోంచి బైటకువచ్చాడు. కాని మెల్లాలో అడుగుపెడుతూనే "అత్తా! జ్ఞానికోసం బొంబాయినుంచి అమ్మ ఒక జత గాజులు తీసుకువచ్చింది. బైటికివచ్చి చూడు" - అని పిలిచాడు బిగ్గరగా.

ఆ గాజులరంగూ, పనితనం చూసి దుర్గామణి పులకిత హృదయంతో ఆమెను మాటిమాటికీ స్తుతించసాగింది. అంత విలువయిన గాజులు పల్లెటూళ్ళలోసంగతి అలావుంచి, కలకత్తాకికూడా దిగుమతికాలేదు అప్పటికింకా. నిజానికి ఆ గాజుల అందమూ, పనితనమూ చూసి, తల్లిపేరుతో అతులుడు తన డబ్బుతోనే బొంబాయిలో కొని తీసుకువచ్చాడు.

తల్లి పిలుపులతో జ్ఞానదా బైటికివచ్చి, నిశ్శబ్దంగా నతముఖియై ప్రేమపూర్వకమైన ఈ తొలికానుకను చేతులు చాచి అందుకుబోయేసరికి ఆమె చేతులు రెండూ కంపించాయి. తర్వాత ఆ గాజులిచ్చినదాత పాదాలకు నమస్కరించి మెల్లిగా అక్కడినుంచి వెళ్ళిపోయింది. ఆమె ఒక్క మాటకూడా మాట్లాడలేదు—కాని యివాళ ఆమె అంతర్యంలోని సంగతి అంతర్యామికే తెలుసు. ఈ వ్యక్తులిద్దరూ ఒక్కక్షణం ప్రేమ

పూర్యకమైన స్నిగ్ధ దృష్టులతో అనింద్యమైన ఆ[illegible]
ఆకార సౌష్ఠవాన్నీ - ఆగమన వైఖరినీ చూస్తూ అలాగే
నుంచున్నారు.

గోలోకనాథుడు చనిపోయాక అతడిభార్య స్వర్ణ
మంజరి, నిర్వంశమైపోయిన పుట్టింటివారి తాలూకు ఆస్తి
అంతో యింతో ఉంటే అదికాస్తా అమ్ముకుని, ఆ సొమ్ము
చేతపుచ్చుకుని ఆఖరి మరిది అనాధనాధుడి ఇంటికిచేరింది.
రెండోవాడైన ప్రియనాథుడు క్రితం సంవత్సరం సరీగ్గా
ఈరోజునే తమ్ముడైన అనాథుడితో వివాదపడి ఇంట్లోభాగ
విడగొట్టుకుని మధ్య అడ్డంగా గోడపెట్టించి దానికి ఒకగుమ్మం
పెట్టించటం అనసరమని అయినా అనుకోలేదు, అప్పుడు ఈ
వైఖరి చాటునుంచి విధాత గమనించి చూచి తప్పకుండా
మందహాసం చేసిఉంటాడు. ఎంచేతంటే సంవత్సరమయినా
తిరగకమునుపే ఆగోడ పెట్టించటంలోని ఉద్దేశాన్ని నిష్ఫలం
చేసి, ప్రియనాథుడు వారంరోజులు జ్వరంతో మంచమెక్కి-
చికిత్స చేయించుకోకుండా ప్రాణాల్ని వదిలేశాడు.

ఇహా రేపు చనిపోతాడనగా—ఆరోజునే అందరూ
ఆశ వదులుకుని ఉన్నారు. అతణ్ణి చూసిపోదామని ఊళ్ళో
వాళ్ళంతా బిలబిలావచ్చి గుమ్మందగ్గర గుమికూడి "అయ్యో
పాపం!" అని అనుకుంటున్నారు. ప్రియనాథుడింకా అప్పటికి
స్పృహ తప్పలేదు. అతులుడు ఊళ్ళోలేడు. కల్ కత్తామెస్‌లో

ఉండగా ఈ దుర్వార్త విని పరుగెత్తుకు చక్కావచ్చాడు. జనాన్ని తోసుకుని అతడు రోగి ఉన్న గదిలోకి వెళ్ళాలని ప్రయత్నిస్తున్నాడు.

జ్ఞానదా ఎక్కడనుంచో పిచ్చిదానిలాగా పరుగెత్తు కుంటూవచ్చి అమాంతం అతడి కాళ్ళమీదపడి. అతడి రెండు పాదాలమీదా తల కొట్టుకో సాగింది. ఈ తమాషా చూచి పోదామని వచ్చినవాళ్ళు తలవని తలంపుగా జరిగిన ఈదృశ్యం చూచి ఆశ్చర్యపోతూ తమలో తాము తర్కించుకోసాగారు. కాని అతులుడుమాత్రం ఇంతమందియెదుట విచారంతోనూ సిగ్గుతోనూ మతిపోయినట్లయినాడు.

ఒక్కక్షణం పోయాక అతడు ఎలాగో మళ్ళీ మనధోరణిలోపడి ఆమెను పట్టుకుని లేవదీయపోయేసరికి జ్ఞానదా అతడి పాదాలమీదనే తల గట్టిగా మోపి, ఏడుస్తూ "నాన్న మరణ సమయంలో నోటిమీదుగా ఏదైన సాంత్వనవాక్యాలు పలికి వెళ్ళు. నా అదృష్టంలో ఎలాఅయినా రాసిపెట్టి ఉండనియ్. నావిషయకమైన బెంగని అయినా ఇక్కడే విడిచిపోయెట్లు చెయ్యండి. ఇంక ఇంతకన్న నిన్ను ఎప్పుడూ ఏమీకోరను" అన్నది.

దిగుళ్ళతో క్రుంగిపోయిన దౌర్భాగ్యుడు ఆమెతండ్రి కేవలం ఆ సమయంలో చనిపోతున్నాడిప్పుడు. ఆమె కిప్పుడు మతిలేదు. ఇంతమంది యెదుటా తానేమిచేస్తున్నదో, ఏమంటున్నదో ఏమీ ఆలోచించి చూచుకో లేదు. ఊరికే అదేపనిగా తల బాదుకుంటూ ఏడుస్తోంది. కాని అతులుడు నిగ్రహం కలమనిషి. జ్ఞానదా ఇలా వ్యవహా

రించటంతో అతడు మనస్సులో ఎంతైనా బాధపడనీ, బైట ఇంతమంది కుతూహలదృష్టులకు కాఠిన్యం వహించినట్లు కన్పించాడు. బలవంతాన కాళ్ళు వెనక్కిలాక్కుని, కొంచెం మెత్తమెత్తగా మందలిస్తున్న ధోరణిలో "ఛీ! కొంచెం ఓర్పు తెచ్చుకో. అలాఏడవకు. నేను చెప్పతగినదేదో ఎందుకు చెప్పను!" అంటూ లేచి మంచంమీదికి వెళ్ళి ఒకప్రక్కన కూర్చున్నాడు అతులుడు. దుర్గామణి భర్త తలంపి దిక్కున కూర్చుని ఉంది. అతులుడి ముఖంకేసి చూసి పైకి విన్పించకుండా ఏడవటం మొదలెట్టింది.

పొరుగింటివాడైన నీలకంఠ ఛటర్జీ గుమ్మంలోనుంచుని ఉన్నాడు. అతులుడు తాత్సారం చెయ్యడంచూసి, "ప్రియనాథుడికి ఇప్పటికింకా స్పృహఉంది నాయనా! నువ్వు చెప్పతలచిందేదో ఇప్పుడే కొంచెం బిగరిగా చెప్పు. అలాఅయితేనే గ్రహిస్తాడు" అన్నాడు. వృద్ధుడి ఈప్రస్తావనను మరికొందరు కూడా సమోదించారని చెప్పటం అనవసరం.

ఆ జనాన్ని చూసి అతులుడు మొదట్లోనే కొంచెం మండిపడ్డాడు. ఆ పైన అనవసరమైన వారి ఈ కుతూహలానికి మరింత ఉగ్రుడై "మీరంతా వృధాగా ఇక్కడ గుమికూడి చేసే ఉపకారం ఏమీలేదు. మీరంతా కొంచెం బైటకువెళ్ళి కూర్చున్నారంటే నేను చెప్పతలచింది ఏమిటో చెప్పేస్తాను" అన్నాడు.

"వృధా ఏమిటోయ్! ఇరుగుపొరుగువాళ్ళకు ఆపదవస్తే ఇరుగుపొరుగు రారూ! నువ్వేమంత మహా ఉపకారం చేద్దామని మంచంమీదకెళ్ళి కూర్చున్నావు బాబూ!" అన్నాడు

నీలకంఠ ఛటర్జీ. అతులుడు లేచి నిలబడి దృఢస్వరంతో "నేను ఉపకారం చేయనీ, చేయకపోనీ, మిమ్మల్ని ఇలా గాలి రాకుండా అడ్డంగా నిలబడి అపకారం మాత్రం చెయ్యనియ్యను. అందరూ బైటికి వెళ్ళిపొండి" అన్నాడు.

అతడి వైఖరిచూసి నీలకంఠుడు రెండు అడుగులు వెనక్కి వేసి నిలబడి, "నిన్న మొన్నటి కుర్రకుంకవి నీ కెంత అహంకార మంటానూ?" అన్నాడు. ఇంకొకరెవరో అతడి వెనక నిలబడి. ఎఫ్. ఏ. లూ, బి. ఏ లూ ప్యాసయినాడుగా మరి! అందుకని" అన్నాడు. పదిపన్నెండేళ్ళ కుర్ర వెధవ ఒకడు తొంగిచూడటం మొదలెట్టాడు. అతులుడు ఎవరికీ ఏమీ జవాబు చెప్పకుండా అతడ్ని ఒకత్రోపు త్రోశాడు.

అతడుపోయి మరొకరిమీదపడ్డాడు. అతడు "సబ్ జడ్జీ కొడుకుగా మహా!" అనుకుంటూ బైటికి వెళ్ళిపోయాడు. నీలకంఠుడు మొదలైన పెద్దమనుష్యులు అతులుడు ఏం చెబుతాడో అనే ఆతురతను వ్యక్తపరచకుండానే మనస్సులో తిట్టుకుంటూ వెళ్ళిపోయారు.

ఇంక బైట ఎవరూ లేకుండా వెళ్ళిపోయాక అతులుడు రోగి ముఖంమీదికి వంగి "మామయ్యా!" అని పిలిచాడు, ప్రియనాథుడు ఎర్రగా ఉన్న కళ్ళను మలిపి విమూఢునిలా చూస్తూ ఊరుకున్నాడు. అతులుడు మళ్ళీ బిగ్గరగా "నన్ను గుర్తుపట్టావా?" అని అడిగాడు. ప్రియనాథుడు కనురెప్పలు వాల్చి 'అతుల్!' అన్నాడు.

"ఇప్పుడెలా వుంది?"

ప్రియనాథుడు తలఊగిస్తూ 'ఏమీ గుణంగా లేదు,' అన్నాడు అస్ఫుటంగా.

అతులుడి కళ్ళల్లో నీళ్లు గిర్రున తిరిగాయి' అతిప్రయత్నంమీద తనను తాను సంబాళించుకుని, గద్గదకంఠాన్ని సవరించుకుని 'మామయ్యా మీకు ఒకసంగతి తెలియజేస్తున్నాను. మీరు నిశ్చింతవహించండి. జ్ఞానదా బారం నేను వహిస్తాను,' అన్నాడు. ప్రియనాథుడి కిది అర్థంకాలేదు. అటూ ఇటూ చూసి 'జ్ఞానదా ఏదీ?' అని అడిగాడు.

దుర్గామణి భర్తముఖంమీదకు వంగి, అశ్రువికృతమైన గద్గదకంఠంతో 'జ్ఞానదాని చూస్తారా ఒకసారి?' అని అడిగింది. ప్రియనాథుడు మొదట్లో జవాబు చెప్పలేకపోయాడు. చివరకు 'ఊహుఁ' అన్నాడు.

దుర్గామణి ఏడుస్తూ 'అతులుడు ఏమంటున్నాడో విన్నారా? అతడు మీ జ్ఞానదా భారం వహించటానికని వచ్చాడు. ఇంక మీరు ఆ బెంగ పెట్టుకోకండి. దౌర్భాగ్యురాలిని ఇదివరకు అనేకవిధాలతిట్టిపోశారు. ఇవాళయినా దగ్గరకు ఒకసారి పిలిచి ఆశీర్వదించండి' అన్నది.

ప్రియనాథుడు మెదలకుండాచూస్తూ ఊరుకున్నాడు. దుర్గామణి మళ్ళీ ఆమాటనే ఆవృత్తి చేసేసరికి అతడి కళ్ల వెంట రెండు అశ్రుబిందువులు దొర్లాయి. తోటకూరకాడలాఉన్న చెయ్యియెత్తి అతులుడి ముఖం ఒక్కసారి నిమిరి ప్రక్కకు ఒత్తిగిలిపడుకున్నాడు. అతడి నోట్లోంచి ఏమాటా బైటికి రాలేదు నిజమే, కాని ఈమృత్యుసమయంలో అతడి హృదయం మీది ఒక పెద్ద బరువును నిస్సంశయంగా తొలిగించానుకదా

అని గ్రహించుకుని అతులుడు హఠాత్తుగా పసిపిల్లవాడిలా ఎక్కి-ఎక్కి-ఏడ్చాడు. దానికిసాక్షులు దుర్గామణి-భగవంతుడు.

మర్నాడు సాయంకాలం - ఏమోనృద్ధులైనవారంతా ఏంచేస్తారో ప్రియనాథుడూ అదే చేశాడు. ఆఫీసులో ముప్ఫై రూపాయల జీతంమీద మమకారాన్ని త్యజించుకుని, ఇరవై ఆరేళ్ళ భార్య, పదమూడేళ్ళ అవివాహితఅయిన కూతురూ-వీళ్ళభారం అంతకన్న దురదృష్టవంతుడైన ఒక ఆత్మీయుని శిరస్సుమీదమోపి, ముప్ఫైఆరేళ్ళ వయస్సులో చికిత్స లేకుండా నూరేళ్ళునిండినవారి శరీరంతో సమానమయిన- జీర్ణ శరీరాన్ని తులసివేదికదగ్గర త్యజించి రామనామస్మరణను వింటూ హిందువుల వైకుంఠానికే కాబోలు వెళ్ళిపోయాడు.

## 3

తమ్ముడు అనాధనాథుడు ఇహ తప్పనిసరిఅయి, నడివాకిట్లో అడ్డగోడకు గుమ్మంపెట్టించాల్సివచ్చింది. అన్నగారి శ్రాద్ధాదులన్నీ అయిపోయిన పదిహేనురోజులు గడిచాక ఒక రోజున అతడు ఆఫీసుకు వెళ్ళబోతూ గుమ్మంలో నిలబడి తాంబూలం నములుతూ "ఇంక చెప్పకపోతే నిల్లేదువదినా! అందరికీ తెలిసినసంగతే. నీకు ఒకపూట పిడికెడు మెతుకులు పెట్టాల్సివస్తుందని నేను భయపడటంలేదు అన్నయ్యా నాతో ఎంత అనుచితంగా ప్రవర్తిస్తేమాత్రం ఏం? నాకు పేరుకు నూటయాభై రూపాయల జీతం అన్నమాటేకాని, పిల్లా జెల్లా ఏమన్నా తక్కువా! అదీగాక మా అమ్మాయికీ పన్నెండేళ్ళు

వచ్చాయి, చూస్తున్నావుగా ? అంచేత నేను చెప్పే దేమి ఉంటే! పిల్లదాన్ని వెంటపెట్టుకుని ఈ సమయంలో నువ్వో ఒకసారి హాస్పిటల్ వెళ్ళావంటే బావుంటుంది" అన్నాడు.

దుర్గామణి వంటయింట్లో ఒక గుంజనానుకుని నిలబడి ఉంది. భయంతోనూ సంకోచంతోనూ "మా అన్నయ్యస్థితి గతులు నీకు తెలిసినవేగా మరిదీ! ఏమీ లేదా మనకు. ఇంత పెద్ద ఆపద వచ్చిందన్న సంగతి వినికూడా ఒకసారి చూచి పోదామనైనా రాలేదు. అదీకాక వచ్చి తీసుకువెళ్ళందే నేను మాత్రం ఎలా వెళ్ళను చెప్పు?" అన్నది.

పెద్ద తోటికోడలు స్వర్ణ ఖంజరి మరది ప్రక్కనే గోడ చాటున నుంచుని ఉంది ఆమె కొంచెం గొంతు పెద్దదిచేసి, "అన్నగారిస్థితి బాగాలేదన్నసంగతి తెలుసుననుకో. కాని నీ మరిదిమాత్రం మహా ఏంగవర్నరా? వినటానికిమాత్రం నూట యాభయ్యే—కాని ఈ సంసారం నేనెలా గడుపుకు వస్తున్నానో అది నాకే తెలియాలి. ఆ మాటా మొహంఎదుట చెబుతున్నాగా—ఇంత నల్లటిపిల్ల నీ మెడలమీదఉంది. కోరి ఎవరు నీ దగ్గిరకువచ్చి నీ పిల్లను చేసుకుంటారో చెప్పు. కాని అలా అని అభిమానానికిపోయి మెదలకుండా కూర్చుంటే వీల్లేదు" అన్నది.

దుర్గామణి మెల్లిగా "అదికాదు అక్కా! నాకు అభిమానం ఏమిటి ?" అన్నది.

స్వర్ణ మరిదిని కుడిచేత్తో వెనక్కులాగి, తానుముందుకు వచ్చి, "నీకు నేనేమీ చెడుమాట చెప్పలేదమ్మా—నువ్వేదో అలా గుటకలు మింగుతూ సమాధానం చెబుతు

న్నావు కాని ? నీకు కోపమేరానీ—నీ చెవులకు కటువుగానే ఉండనీ బాబూ! నీకూతురు ఈ అతిలోకరంభకు మేము పెళ్ళి చెయ్యలేము. పిల్లల్నికనే ఈడుకూడావచ్చింది చూడబోతే. ఎవరైనా దానిముఖంకేసి చూచారంటే ఇంక దృష్టి మరల్చుకోగలరా? కనుక నిజం చెబుతున్నా నేను—నీ కూతురుముఖంలోని అందానికి తగినట్లే ఎలాగోఅలా హరిపాల్ వెళ్ళి ఎవరికో ఒకరికి ఏ రైతుకో ఇచ్చి కట్టు. బెడద తీరిపోతుంది అక్కడి వాళ్ళు అందచందాలను అంతగా చూడరని విన్నాను. ఆడ పిల్లయితే చాలుట!" అన్నది.

దుర్గామణి మెదలకుండా ఊరుకుంది. ఏ వివజ్ఞాల మూలంగా తాముఇదివరలో విభాగాలయినారో ఆవివజ్ఞాలే మళ్ళీ పైకివస్తూఉండటంచూచి భయంతో ఆమె కొయ్యబారిపోయింది. "నిన్నెవరూ ఏమీ అనరు. ఆ:. ఎవరైనా అంటే ఇంకా మర్యాలేన్నీ అంటూరు. రెండుపరీక్షలు తక్కువపాస్యాసయిన వాడ్ని అల్లుడ్నిగా తెచ్చుకుంటే ఊళ్ళోవాళ్ళు యావన్మందీ ఛీ ఛీ అంటూరు, వీళ్ళేమిటి ఇలాచేశారు ? ఇంటి పెద్దకోడ లుండగా ఆమెను దుర్గావిగ్రహంలాగా గంగలో దింపారాయేం! అంటూరు అందరూ. అవునా కాదా మరిదీ?" అంటూ స్వర్ణ అనాథుడిమీదికో కటాక్షం విసిరింది.

"అవును. అలా ఎందుకు అనరు?"

అంటూ అనాథుడు మహామాన్యురాలైన తన పెద్ద వదినగారి మర్యాద నిలబెట్టి, ఆఫీసుకు వేళ మించిపోతున్న దనే మిషతో మెల్లిగా వెళ్ళిపోయాడు.

"మీ అన్నను పోయి ఆశ్రయించి ఎలాగో అలా ఎవణ్ణో ఒకణ్ణి వరుణ్ణి పట్టుకో. అందుకు నువ్వేమీ సిగ్గుపడ నక్కర్లేదమ్మా! నిన్నెవ్వరూ అలా చేసినందుకు నిందించరు. ముప్ఫయి రూపాయలతోనేగా ఇదివరకు అందగా కాలక్షేపం చేసింది. ఆ సంగతి ఎవరికి తెలియదు! ఎవరు ఎరుగరు? రేపు ప్రయాణానికి బాగుంది. నేను చెబుతున్నానుగా రేపే బయలుదేరు" అన్నది స్వర్ణ.

దుర్గామణి మనస్సులో ఒక్కసారి అతులుడి సంగతి గుర్తుకు తెచ్చుకుంది. కాని వీళ్ళ ఎదుట మాత్రం ఏమీ మాట్లాడలేదు. ఎంచేతనంటే స్వర్ణనువట్టే అతులుడి తోతమకి ఉన్న చుట్టరికం. స్వర్ణ అతులుడితల్లికి మేనమమామకూతురు.

ఆరోజున జ్ఞానదా అతులుడి కాళ్ళమీదపడి ఏడవటం తల్లి కూడా చూసింది. నిజమే. కాని అంత పెద్ద ఆవద ముంచు కొస్తూంటే ఒకమూల-దీనికి ఓ పెద్దకారణం ఉన్నదనే సంగతే ఆలోచించలేదు అప్పుడు. పేదవాళ్ళు తీరుబడిగా కూర్చుని దుఃఖించాల్సిన అవసరంకూడాలేదు. అంచేత భర్త పోయిన మర్నాటినుంచీ ఈ సంగతే ఆలోచించ సాగింది. గదిలోనికివెళ్ళి చూసేసరికి కూతురు మెదలకుండా క్రింద కూర్చునిఉంది. మెల్లిగా వెళ్ళి ఆమెదగ్గర కూర్చుని, "ఆవిడ ఏమన్నదో విన్నావా?" అని అడిగింది.

విన్నా నన్నట్టు తల ఊగించి జవాబు ఇచ్చింది. తర్వాత తాను ఇంకేమి చెప్పాలో దుర్గామణికి తోచలేదు. కాని కూతురే "ఎప్పుడూ పుట్టింటికి వెళ్ళనే లేదామె! ఇప్పుడు ఒకసారి ఎందుకు వెళ్ళి రాకూడదమ్మా?" అన్నది.

"మా అమ్మ బ్రతికిలేదు కదా? అన్నయ్యా ఉన్నాడంటే ఆయన నేను ఎక్కడున్నదీకూడా పట్టించుకోనేలేదు. ఇంత ఆపద వచ్చిందని తెలిసికూడా ఒక్క ఉత్తరంముక్కయినా వ్రాయకపోయె! వెళ్ళటానికి ఎలా మనస్కరిస్తుంది. చెప్పు అమ్మా!" అన్నది దుర్గామణి.

"పేదవాళ్ళ సంగతి ఎవరూ పట్టించుకోరు అమ్మా! వాళ్ళూ పట్టించుకోలేదు-వీళ్ళూ పట్టించుకోరు, పైగా వీళ్ళు వెళ్ళిపొమ్మనికూడా చెప్పేశారు. మన మానాభిమానాలు నాన్నతో కూడానే పోయాయి అమ్మా!" వెడదాం పద. మనం అక్కడికేపోయి ఉందాం" అన్నది కూతురు.

తల్లి కళ్ళవెంట కన్నీళ్ళు కారుతున్నాయి. కూతురు ఆ కన్నీళ్ళు తుడిచి, "కేవలం నువ్వు నామూలంగానే ఎక్కడికి వెళ్ళటానికి ఇష్టపడటంలేదు అని నాకు తెలుసు. లేకపోతే పెద్దమ్మ అలా అన్నందుకు నువ్వు ఒక్కరోజయినా ఇక్కడ ఉండేదానివి కావు. నాకోసం నువ్వు దిగులు పెట్టుకోవద్దు అమ్మా! పద. కొన్నాళ్ళపాటు మనం ఎక్కడికయినా పోదాం పద. ఇక్కడున్నామంటే చచ్చిపోతావు నువ్వు" అన్నది.

తల్లి ఇంక సంబాళించుకోలేక పోయింది. కూతుర్ని హృదయానికి హత్తుకుని ఎక్కెక్కి ఏడ్చింది. కూతురు అందుకు అడ్డురాలేదు. ఓదార్చటానికి ప్రయత్నించనూ లేదు. తల్లి హృదయానికి తల ఆనించి మెదలకుండా కూర్చుంది, చాలా సేపటికి దుర్గామణి తానే కొంత తెప్పరిలి కళ్ళుతుడుచుకుని, "నీకు నిజం చెబుతున్నానే జ్ఞానదా! నువ్వు లేకపోయినట్లయితే నేనుకూడా ఆరోజునే-వారుపోయినరోజునే-ఎక్కడికో

అక్కడికి వెళ్ళిపోయేదాన్ని. కేవలం నీకోసమే అలా వెళ్ళ లేకపోయాను'' అన్నది.

''అది నాకు తెలుసు అమ్మా!

''సరేకాని నాకు ఒక్కసంగతి నిజంచెప్పు అమ్మా! ఆరోజున అతులుడు అలా ఎందుకు అన్నాడు? కాదు అమ్మాయీ, అలా ముఖం దాచుకుంటే కాదు. సిగ్గుపడాల్సిన సమయంకాదు ఇది. నాకు తెలుసు. అతడు అబద్ధం చెప్పే వాడు కాదు. అయితేమరి వారి మృత్యుసమయంలో అతడు మాత్రం ఎందుకలా భరోసా కల్గించి పోయాడు! నువ్వు అలా అతడి కాళ్ళమీదపడి ఎందుకు ఏడ్చావు?''

జ్ఞానదాతల్లి హృదయంలోనుంచే ''అది నాకు తెలి యదు అమ్మా!'' అని అన్నది అస్ఫుటంగా.

దుర్గామణి బలవంతాన కూతురి ముఖం ఒకసారి పైకి ఎత్తి చూద్దామని ప్రయత్నించింది. కాని జ్ఞానదా మాత్రం అలాగే గట్టిగా కావిలించుకుని కూర్చుంది. ఆమె విఫలమనో రథురాలై మీ నాన్న బ్రతికివున్నట్లయితే నాకు మనస్సులో బెంగ ఏమీ ఉండేదికాదు, నిజమే కాని ఆరోజునుంచీ ఆలో చించి ఆలోచించి ఇప్పుడు చాలా సంగతులు తెలుసుకోగలి గాను. అతులుడి నోటిమీదుగా వచ్చిన ప్రతి చిన్నమాటా నా కిప్పుడు గుర్తుకు వస్తున్నాయి'' అని అంటూనే ఆమె ఆదు ర్దాగా కూతురి చేతులు రెండూ తనచేతుల్లోకి తీసుకుని ''నిజం చెప్పు అమ్మా! నేను మనస్సులో అనుకుంటున్న సంగతి అబద్ధం కాదు కదా! నేను ఇన్నాళ్లనుంచీ కేవలం కలలు కనటం లేదుకదా?'' అని అడిగింది.

జ్ఞానదా ముఖం అలాగే దాచుకుని "ఏమోనమ్మా! అతడి ధర్మం అతడిది" అని అన్నది.

దుర్గామణి ఆనందంతో, ఆవేగంతో అశ్రువులను ఆపుకోలేకపోయింది. "నన్ను ఊరికే సంశయంలో పడేసి ఇక వేధించకు తల్లీ! ఒక్కసారి నోరువిప్పి చెప్పు-నేను ఒక్కసారి మీ నాన్నకోసం మనసారగానయినా ఏడుస్తాను - నా యీ ఏడుపు వారు యీనాడు వినకలుగుతారు" అన్నది.

కూతురు మెల్లిగా "ఏడవరాదా అమ్మా! నేను నిన్ను ఎప్పుడూ ఏడవవద్దు అనలేదు. నాన్న కీ సంగతి తెలియ చెయ్యమన్నాను - అతడంతట అతడే తెలియచేశాడు.

"ఇంక అతడి ధర్మం అతడిది!" అన్నది.

దుర్గామణి ఈసారి కూతురి అభ్యంతరాన్ని లెక్క చెయ్యలేదు. అశ్రుసిక్తమైన కూతురి ఆ రక్తహీనముఖాన్ని పైకి ఎత్తిపట్టుకుని - వెయ్యిసార్లు ముద్దెట్టుకుని, మళ్ళీ వక్షానికి అదుముకుని చాలాసేపు కన్నీళ్ళు కార్చింది. తర్వాత కళ్ళు తుడుచుకుని మెల్లిగా "అది నిజమేనమ్మా! నిజమే! అతడిధర్మం అతడిదే-అతన్ని చావుబతుకుల్లో ఉండగా నువ్వే బ్రతికించావు అన్న సంగతి నాకెప్పుడూ ఒక్కరోజునయినా జ్ఞాపకం రాలేదమ్మా! అతడు బ్రతుకుతాడనే ఆశే లేకపోయింది ఎవరికీ. భయంతో ఎవ్వరూ అతడి ఛాయలకయినా పోలేక పోయారు. నువ్వు యింత పిల్లవయినా రాత్రింబగళ్ళు యముడితో పోట్లాడి అతన్ని మళ్ళీ బ్రతికించావు. అతడు తన ధర్మాన్ని నిలబెట్టుకోకుండా ఉంటాడా అలాంటవాడు? సావిత్రి లాగా యముడి హస్తాల్లోంచి నువ్వు విడిపించుకుని వచ్చిన

అతణ్ణి భగవంతుడు తీసుకెళ్ళి మరొకరిచేతుల్లో ఒప్పగిస్తాడా? ఈమాత్రం ధర్మనే లేకపోతే ఇహ సూర్యచంద్రులు మాత్రం ఎలా ఉదయిస్తారు?" అన్నది.

కాస్సేపు మౌనంవహించి, మళ్ళీ పులకిత హృదయంతో "ఇంక నువ్వు నన్ను ఎక్కడికి వెళ్ళమంటే అక్కడికే వెళ్ళ గలను. కాని నువ్వుఅతడియిష్టంలేనిదే రాలేవా అమ్మాయీ! అవును, అదీనిజమే. అందుకనే మాతండ్రి తిరిగి రాగానే చీకటితో గాజులు ఇవ్వాలనే మమతో నాతల్లిని చూసిపోవ టానికి వచ్చాడు. అయ్యో! మీరు ఇంకో యేడాది బ్రతికి ఉండి మీకళ్ళతో ఎందుకు చూచుకుని పోలేదూ!" అంటూ పొంగి పొర్లుకువస్తున్న ఏడుపును పమిటిచెంగు అడ్డం పెట్టు కుని ఆపుకుంది.

"ఇదిగో! నిన్నే!"

దుర్గామణి గబగబా కూతుర్ని వక్షం మీదనుంచి ప్రక్కకుత్రోసి, కళ్ళుతుడుచుకుని "ఎందుకు అక్కా?". అని పలికింది.

పెద్దావిడ ఒక్కసారి గదిలోకి దృష్టిపోనిచ్చి, కఠిన స్వరంతో "పోనీ నీకంటే దుఃఖంలో ఉన్నావు కనక ఆకలి దప్పులు లేకపోవచ్చు. కాని యింట్లో అందరూ ఉపవాసాలు చెయ్యలేరు. ఒక్కసారి బైటకివచ్చి ఎంత ప్రొద్దెక్కిందో చూడు" అన్నది.

దుర్గామణి తొట్రుపడుతూ గదిలోంచి బైటికివచ్చింది. ప్రొద్దుకేసిచూచి సిగ్గుపడుతూ కూతురిపేరుఎత్తి ఏదో సంజా యిషీ చెప్పబోతుండగా స్వర్ణమంజరి కటువుగా "బాగుంది!

వంటపని పూర్తిచేసుకుని రోజల్లా ఇహ కూతుర్ని దగ్గిర కూర్చోబెట్టుకుని, ముంతనాలాడు. నేను ఒక్కమాటకూడా మాట్లాడను ఇంక. కాని మా పిల్లలు ప్రొద్దెక్కిందంటే పైత్యం ప్రకోపించి చచ్చిపోతారు. ఉహూఁ ఇలాంటి విడ్డూరపు వ్యవహారాలయితే నేను సహించలేను బాబూ!" అంటూ నిత్యసంతానవతియైన పెద్దావిడ ఆఖరితోటికోడలి సంతానం మీద మహా మాతృప్రేమను కుమ్మరించి జవాబుకోసం ఎదురుచూడకుండానే వెళ్ళిపోయింది.

అనాథుడి సంసారంలో మళ్ళీ అడుగుపెట్టి నప్పట్నుంచీ వంటయింటిభారం యావత్తూ దుర్గామణే వహించ వలసివచ్చింది. పెద్ద తోటికోడలూ-చిన్న తోటికోడలూ-ఒకరేమో వీధిఅంతా పెత్తనాలుచేస్తూ ఇంట్లోఖర్చు అంత అవుతోంది ఇంత అవుతోంది అని యాగీ చేసేవారు. మరొకరేమో నవలలు చదువుతూ, నిద్రపోతూ, బాతాఖానీ వేసుకు కూర్చుంటూ కాలక్షేపం చేసేవారు.

అనాథనాథ్ ఢిల్లీఎక్స్ప్రెస్సే. తెల్లవారు ఝామున లేచి వేళకు వంటచేసి పెట్టటమనేది ఈ యింట్లో అశాంతిని రెచ్చగొట్టే ఒక దారుణమైన వ్యవహారం. ఈవిషయమై పెద్దావిడకూ-ఆఖరి ఆవిడకూ ఎప్పుడూ ఏవో తగాదాలూ మనస్పర్థలే. ఇటీవల కొన్నాళ్ళనుంచీ ఈ హంగామా లేక పోవటంతో ఉభయులమధ్య విడిపోయిన ప్రేమసూత్రం మళ్ళీ ముడిపడింది.

కాని ఇవాళ ప్రొద్దున్నే మళ్ళీ ఆ ముడి విడిపోవటానికి సిద్ధమయింది. దానికి కారణం ఏమంటే-ఏడుగంట లయింది.

అప్పుడే నిద్రలేచి చిన్నావిడతో దాసీదివచ్చి "పొయ్యిలో నిప్పువేశాను - మండిపోతోంది, కొంచెం త్వరగా వంట చేయాలి" అని చెప్పింది.

ఆవిడ విసుక్కుంటూ "ఏం మా చిన్నతోటికోడ లేమయింది ? ఏం చేస్తోందేం? ఏడుగంటలయినా ఆవిడకింకా ఆ స్పృహ లేదా ?" అని అడిగింది.

"ఆ స్పృహా ఎందుకు ఉండకుండా పోతుందమ్మ గారూ! తెల్లవారుఝామునే లేచి తల్లీ కూతురూ సామానులు అవీ సర్దుకుంటున్నారు. ఈ ఎనిమిదిగంటల రైలుకే వారి పాలో ఎక్కడికో వెడతారటగా అమ్మా!" అన్నది దాసీది.

ఆవిడకు నిన్నటిసంగతి జ్ఞాపకం వచ్చింది. అయినా ఏమాత్రం ప్రసన్నురాలు కాకుండానే "వెడతామంటే వెళ్ళిపోవటమేనా యేం? బాబుగారి హుకుం తీసుకుందా ? అక్కతో చెప్పిందా ?" అని అడిగింది బిగ్గరగా.

"బాబుగారి సంగతేమో తెలియదు కానీండి అమ్మ గారూ? పెద్దమ్మగారే వారిని ఇవాళ వెళ్ళిపొమ్మనిచెప్పింది" అన్నది దాసీది.

"అయితే ఆవిడతోనే చెప్పు ఎనిమిదిన్నరకల్లా వంట కావాలని-నాకు తెలియదు" అంటూ ఆఖరి ఆవిడ కోపంతో మండిపడుతూ, ఇంత పచ్చిక నోట్లో వేసుకొని, ఒక తువాల పైన వేసుకుని దొడ్డిదారిని బైటికి వెళ్ళిపోయింది.

"ఆవిడగారు ఉంటేకదా చెప్పటానికి ? ఆవిడ గంగా స్నానానికి వెళ్ళారు" అని చెప్పి దాసీది తనపనిమీద తాను వెళ్ళిపోయింది.

ఆఖరిఆవిడ మళ్ళీ వెనక్కి తిరిగిరావలసివచ్చింది; ఎంచే తంటే ఆఫీసులో అధికారులు తనకోపం యొక్క మర్యాదను తెలుసుకోలేరు. ఎలాగో అలా రెండు మెతుకులు ఉడక వెయ్యకతప్పదు. లేదా భర్తను అభోజనంగా ఆఫీసుకు పంప టం అవుతుంది. ఈ రెండింటిలో ఏదోఒకటి తప్పదు. అంచేత ఆవిడ తిరిగివచ్చి, దుర్గామణి గది గుమ్మంముందర నిలబడి, తీక్ష్ణంగా "వెళ్ళిపోవటమేనా! కాని ఇంత హంగామాచేసి వెళ్ళకపోతే మాత్రం యేం చిన్నకార్యం ?" అన్నది.

తలపనితలంపుగా ఈమె ఇలావచ్చి పడటంతో దుర్గా మణికి నోట మాటరాకుండా పోయింది.

"మీరు ప్రొద్దున్నే వెళ్ళిపోతారని మాకెవరికీ తెలి యనే తెలియదు. ఆవిడేమో గంగాస్నానానికి వెళ్ళింది. నేనేమో ఇప్పుడు నిద్రలేచా, టైముకి వారికి భోజనం ఎలా అమరుతుంది చెప్పు ?" అన్నది.

"ప్రాతఃప్రణామాలు అత్తలకు" అంటూ అతులుడు వసారాలోకివచ్చి నుంచున్నాడు.

ఆఖరి ఆవిడ వెనక్కి తిరిగి "నువ్వింత హఠాత్తుగా వచ్చావేం ?" అని అడిగింది.

అతులుడు కలకత్తాలో మెస్‌లోఉంటున్నాడు. ఉత్త రం చూసుకుని అక్కడనుంచి ఆదరాబాదరా బయలుదేరి ఇప్పుడేవచ్చాడు. ఇంకా ఇంటికైనా వెళ్లలేదు. "ఇవాళ ప్రొద్దున్నే అత్త హరిపాల్ గంగాయాత్రకువెడుతూంటే ఆఖరి సారిగా ఒకసారిచూడటానికి రావద్దూ? హరిపాల్! అంటే మరే రియా డిపో అన్నమాట! సరేకాని ఈ ఆశ్వయుజమాసపు

నుప్రభాతంలో నీ కిలాంటి సద్బుద్ధి కలిగించింది ఎవరమ్మా? చెప్పు అత్తా! ఓ! మాటలూ అవి కట్టుకోటంకూడా పూర్తి అయిందే!" అంటూ అతడు నవ్వుతూ తన దృష్టిని గది మధ్యకు పోనిచ్చేసరికి-ఒకవైపునుంచి ఆ రక్తములూ అశ్రు ప్లావితములూ అయిన నేత్రద్వయంనుంచి ఏదో "టెలిగ్రాం" సూచన అంది అతడు తెల పోయాడు.

"నీ కీ సంగతి ఎలా తెలిసింది అతుల్ ?" అని అఖ రావిడ ప్రశ్నించింది.

"నాకా? ఎబ్బే-" అంటూ అతులుడు ఆమె కేదో సంజాయిషీ యిచ్చాడు.

హఠాత్తుగా మెల్లాలో ఏవైపునుంచో స్వర్ణమంజరి కంఠస్వరం శబ్దభేది అయిన బాణంలాగా రివ్వున అందరి చెవు లకూ వచ్చి సోకింది. అంటే ఆవిడ గంగాస్నానంతో పరిశుద్ధురాలై వచ్చి యింట్లో అడుగుపెట్టగానే దాసీదానివల్ల పొయ్యి ఊరికే మండిపోతున్నదన్న సంగతి విన్నదన్నమాట! అంచేత తోటికోడలు దుర్గామణికి వైధవ్యం రావటానికి అసలు కారణం ఏమిటో బాహాటంగా ఏకరువు పెడుతూ లోపలికి వస్తోంది. "నాలుగుపాదాలూ పూర్తికానిదే భగవంతుడు ఎవరికయినా ఎన్నడయినా సర్వనాశనం కలిగిస్తాడా? కలిగించడు! యిది ఆయనధర్మసంస్కారం-ఇక్కడ అధర్మానికిచోటులేదు" అంటూ సరాసరి లోపలికివచ్చి గదిలోపలిగుమ్మంలోపలి ఒకకాలు పెట్టి "నీ ఉద్దేశ్యం యిదా ఏమమ్మా చిన్నావిడా? భోజనం చేయకుండా మరిది ఆఫీసుకు వెడితే - సాయంకాలం అయ్యేసరికి పైత్యంఎక్కువై జ్వరంతో ఇంటికి తిరిగివస్తాడుకదా!అతన్నాత

నీకు జరిగినట్లుగానే మరొక వ్యక్తికికూడా సర్వనాశనం అవుతుందిః చూ ? అనేగా !" అన్నది.

దుర్గామణి లోపల్లోపల కంపించిపోయి, "నారాత ఇలా కాలిందికదా అని-పరమశత్రువు కయినా యిలా జరగాలని నేనెన్నడూ కోరుకోను అక్కా! కాని నేను ఏంచేశానని ఇవాళ లేస్తూనే నీచేత ఈకటువైన మాటలు పడాల్సివచ్చింది!" అన్నది.

స్వర్ణ బొరలుచూస్తూ, మూతీముక్కూవిరుస్తూ" ఏమీ ఎరుగని నంగనాచి! ఏంచేసిందో నేను చెప్పాలిట! పదున్నర అయింది. వైనుకు వంట ఎవరుచేస్తారనుకున్నావ్?" అన్నది.

అతులుడు యింతవరకూ తెల్లబోయి వింటూ ఊరుకున్నాడు, వాళ్ళపెద్దఅత్తసంగతి అతడికి బాగా తెలుసు. అందుకనే అతడు ఆమెతో అంతగా అసలు మాట్లాడడు. కాని ఈసారి యిక సహించలేక ఆమె ప్రశ్నకు తానే జవాబు ఇచ్చాడు." నిజం చెబితే నీకు కోపంవస్తుందమ్మా అత్తా! కాని రాత కాలిపోకపోతే ఎవరూ నీయింట తిండతినటానికి రారు" ఆసంగతి నీకూ తెలుసు-ఈ వీధిలోవాళ్ళకీ సలుగురికీ తెలుసు. కాని ఇవాళ ప్రయాణమై వెళ్ళేరోజున పాపం! ఆ దౌర్భాగ్యు రాలిని కాస్త క్షమిస్తే నీపుట్టి ఏమీ మునిగిపోదు లేవమ్మా!" అన్నాడు.

చటుక్కున అతులుడి ఈమాటలు వినుకుని తోటికోడళ్ళ కిద్దరికీ కలిగిన ఆశ్చర్యానికి అంతులేదు. ఒక్కనిమిషం ఎవరినోటివెంటా మాటరాలేదు. తర్వాత "నువ్వు కలకత్తానుంచి మాతో పోట్లాడదామనే వచ్చావా యేంరా?" అని అన్నది స్వర్ణ.

"పోట్లాడాలని ఎందుకురావటం అక్కా! వాళ్ళ చిన్న అత్తను మనం హరిపాల్ గంగాయాత్రకు పంపుతున్నామని ఆఖరిసారిగా చూసిపోదామని వచ్చాడు" అన్నది ఆఖరావిడ.

"ఓ! నిజమేఅది!"

"అదేనమ్మా అక్కా, అదే! అందుకనే అప్పటినుంచి ఆలోచిస్తున్నాం. ఇంట్లోవున్నవాళ్ళకు మనకు ఎవరికీ తెలియ లేదే! కలకత్తాలో వుంటున్నవాడికి ఇతగాడికి ఎలా తెలి సిందా అని! అయితే లోకం అనుకుంటున్న సంగతి అబద్ధం కాదన్నమాట!" అన్నది.

కోపంతో స్వర్ణకు ఒళ్ళు తెలియటంలేదు. ఆమె బిగ రగా అరుస్తూ ఏదో నానా గందరగోళమూ చేసింది. "భేష్! బాగుందిబాబూ? మరి ఇంత అభిమానమున్నవాడివి మీ అత్తను మేము గంగాయాత్ర చేయించటం ఎందుకు? మీ యింటికే తీసుకెళ్ళి అక్కడే అట్టే పెట్టుకోలేకపోయావా? ఊరుఊరు యీవత్తూ "సహవ్వా" అని తెగ మెచ్చుకునే వాళ్ళుగా?" అన్నది.

ఆమె మాటల్లోని వివజ్ఞాలకు అతులుడి బుర్ర అస్త వ్యస్తం అయింది. "మంచిదేనమ్మా అత్తా! మీరు కావలసిన వాళ్ళు. ఈ సంగతి రెండురోజులు ముందుగానే చెబితే బావుం డేది. ఆవిడ మాయింటికే రావాలిగాని వస్తే నేను నెత్తిన పెట్టుకుని తీసుకువెడతా. నీఊళ్ళోవాళ్ళంతా అందుకు వహ్వా అననీ, ఛీ, ఛీ, అననీ నేనేం పట్టించుకోను" అని అన్నాడు.

ఆ మాటలు అనేశాక అతులుడు సిగ్గుతో తానెంత కుంచుకుని పోయాడో—అవతలవాళ్ళు కూడా ఆశ్చర్యంతో

అసహ్యాతతో స్తంభితులయినారు. ఎక్కడనుంచో ఓ ప్రచండ మైన శుడిగాలివచ్చి సిగ్గు, బిడియాలనూ, చాటుమాటులనూ సమస్తాన్నీ ఒకక్షణంలో తుడిచిపెట్టేసి, అందర్నీ తీసుకువెళ్ళి ఓ పెద్ద ఎడారిలో దింపినట్లయింది. ఒకరిముందు ఒకరు ఏదైనా గోప్యంగా ఉండటానికికాని కప్పిపుచ్చటానికి కాని అవకాశం లేకుండా పోయింది.

అతులుడు నిశ్శబ్దంగ బైటికి వెళ్ళిపోయాడు. యదు బాగ్గ ఎద్దుబండి తీసుకువచ్చి "అమ్మగారూ! టైమవుతోంది. సామానులుఅవీ ఇప్పిస్తారా? ఇప్పట్నుంచీ బయల్దేరితేగాని, రైలువచ్చే వేళకు స్టేషన్‌కి వెళ్ళీఅందుకోలేము" అంటూ అతడు లోపలికివచ్చి, వాళ్ళు చెప్పినప్రకారం ట్రంకుపెట్టె, దాని మీాదఉన్న పక్కచుట్ట ఎత్తి నెత్తినెట్టుకొని బైటికీవెళ్ళాడు. పెద్ద తోటికోడలూ, చిన్న తోటికోడలూ గబగబా వెళ్ళి పోయారు. దుర్గామణి దుర్గానామస్మరణ చేసుకుంటూ తలుపుకు తాళంపెట్టి, కూతురుచెయ్యి పుచ్చుకొని వెళ్ళి బండిలో ఎక్కికూర్చుంది. కూతురు మూర్ఛపోయినదానిలాగా తల్లి ఒడిలోకళ్ళు మూసుకొని పడుకుంది.

౪

పదకొండు సంవత్సరాలకు దుర్గామణి మళ్ళీ పుట్టింటికి హారిపాల్‌కు వచ్చింది. శరత్కాలపు సాయంసమయమది. ధూసరితమై – అనారోగ్య చిహ్నాలతో బైటికి కనిపిస్తున్న ఆ ఊరుచూసేసరికి లోపలికి వెళ్ళాలంటే దుర్గామణికి గుండె

దడదడలాడింది. ఆమెకు పుట్టింట తల్లిదండ్రులు లేరు. అన్న గారు మాత్రం ఉన్నాడో కాయన. శంభూ చటర్జీకి ఆరోజు వరుసజ్వరం వచ్చేరోజు. అంచేత సూర్యాస్తమయం కాగానే అతడు వెళ్ళి ముసుగుపెట్టుకుని మంచంమీాద పడుకున్నాడు. ఈసంగతి విని చెవులమీాదివరకు రొజాయికప్పుకుని పాండ్లు టకటక లాడించుకుంటూ బైటికివచ్చి ఆమెను గుర్తించాడు.

"ఎవరు? దుర్గా? వచ్చావా? రా, లోపలికి రా అమ్మా!" అన్నాడు.

దుర్గామణి ఏడుస్తూ ముందుకువచ్చి, అన్నగారికి పాదాభివందనం చేసింది. జ్ఞానదాకూడా నమస్కరించగానే, "ఇది కూతురనుకుంటాను! ఏఊరు ఇచ్చావుదీన్ని?" అనిఅడిగాడు.

దుర్గసంకోచిస్తూ "ఇంకా పెళ్ళిచెయ్యలేదుఅన్నయ్యా-ఎక్కడో అక్కడ తొందరలోనే—"

"ఆఁ! పెళ్ళిచెయ్యలేదూ?" బాగా పెళ్ళియీాడువచ్చిన పిల్లకాదుటే ఇది దుర్గా?" అన్నాడు. చెల్లెలు చాలారోజులకు కన్పించటం మూలంగా ఆమెమీాద మొదట్లో కొంచెం జాలి కలిగింది. ఒక్కక్షణంలో మళ్ళీ ఆజాలికాస్తా ఇగిరిపోయింది. "అదే! ఇక్కడవాళ్ళంతా కేవలం ఒత్తిదుర్మార్గులు- వాళ్ళకు తెలిసిందంటే- అంచేత దాన్ని యింట్లోకీ, దేవతార్చన గది లోకీ మాత్రం వెళ్ళనీయకు. తెలుసుగా నీకు ఇక్కడి సమాజం సంగతి సందర్భాలన్నీ! అందునా ప్రత్యేకించి ఈ హారిపాల్ సంగతి! ఇంత దౌర్భాగ్యపు ఊరు భూప్రపంచంలో ఎక్కడా లేదు. రా" లోపలికిరా. ఇంత ఈడువచ్చిన పిల్లని పోస్ట్ వాళ్ళబాబాయ్ దగ్గర దిగబెట్టివస్తే — హాయిగా నువ్వు

నాలుగురోజులుండి వెళ్ళేదానివిగా! ఇక్కడ కనుక ఉన్న దంటే- తెలియదా దుర్గా!. సరేలే, అమ్మా! రా, వచ్చి చేతులూకాళ్ళూ కడుక్కో. ఇదుగో నేవ్! ఎక్కడున్నావ్!" అంటూ శంభుచటర్జీ పాంకోళ్ళు టక టక లాడించుకుంటూ మళ్ళ యింట్లోకి వెళ్ళాడు. దుర్గ, ఆమె కూతురు అతడివెంట లోపలికి ఎలావెళ్ళారో అది భగవంతుడికే తెలియాలి

శంభుకు ఇది రెండో సంబంధం, అతడి మొదటిసంబంధం భార్యను దుర్గామణి చూసిందికాని, ఈమె నెప్పుడూ చూడ లేదు. ఆవిడ ఎంతనల్లగా ఉంటుందో అంతసన్నగా పొడుగ్గా కూడా ఉంటుంది. మలేరియావల్ల శరీరం పొగచూరిన కట్టెలా అయింది. మూడురోజులనుంచీ మెల్లాలో పోగేసి ఉన్న పేడఅంతా యిప్పుడే పిడకలుచేసి కొట్టి, చేతులూ కాళ్ళూ కడుక్కుని భర్త పిలుపువిని ఎదుటికివచ్చి ఈవ్యాపా రంచూసి తెల్లపోయింది. శంభుకు జ్వరం వస్తోంది. వచ్చిన వాళ్ళను మర్యాదచేయటానికై భార్యకు పేళ్ళను సంక్షి ప్తంగా పరిచయంచేసి, గదిలోకిపోయి పడుకున్నాడు. ఆవిడ పేరు భామిని. మేదినీపూర్ జిల్లా ఆడపడుచు. ఆవిడమాటలు అవి కొంచెం వంకరటింకరగా ఉంటాయి. ఆమె నవ్వుతూ ఆడుబిడ్డను చెయ్యిపుచ్చుకుని లాక్కునివెళ్ళి వంటయింటి వసారాలో పీటవేసి కూర్చోపెట్టింది. ఆనవ్వూ, ఆ మాటల తీరూ చూచేసరికి దుర్గకు గుండెలుకూడా ఆరుకునిపోయాయి. వచ్చేటప్పుడు దుర్గ ఒకక్యారియర్ నిండా రసగుల్లాలు కొను క్కుని తీసుకువచ్చింది. అది చూతతీసేసరికే పిల్లలగుంపు మిడు తల దండులా వచ్చిపడింది. వాళ్ళు కేకలతో, గల్లంతులతో

ఆయింటిని సంతబజారులా చేశారు. వాళ్ళమ్మ ఒకళ్ళకి అర, మరొకరికి పాతిక మిగిలినవాళ్ళ కిద్దరికీ రెండు చిన్నచిన్న ముక్కలూ చేతిలోపెట్టి. మిగతా క్యారియర్ తాను ఖాళీ చేసి, దాన్ని తీసుకెళ్ళి గదిలో వంకెకు తగిలించింది. పిల్లలు తమకు చిక్కింది కాస్తా గుటుక్కున మింగేసి, చేతులు నాక్కుంటూ బైటికి వెళ్ళిపోయారు.

దుర్గకు ఇక్కడ రీతి రివాజులు కొన్ని తెలుసు. ఎంచే తంటే ఆమె ఆఊరి ఆడపడుచు. కాని జ్ఞానదా ఏడెనిమిదేళ్ళ పిల్లలుకూడా దిసమొలలతో ఉండటంచూసి, సిగ్గుతో తలవంచు కుంది. ఆడపిల్లలుకూడా ఇంచుమించు అలాగేఉన్నారు. మిగి లిన సంగతులేవీ అంత చెప్పుకోదగ్గవికావు. వాళ్ళ ఊరుకూడా బస్తీ కాకపోయినప్పటికీ ఆ ఊరుకు రాతిరోడ్డుఉంది. చుట్టూ ఇలా వెదురుపొదలమీదుగా- తుమ్మచెట్లమీదుగా వాళ్ళ ఊరికి కారుచీకట్లు క్రమ్ముకోవు. ఇలా నాలుగు వైపులనుంచీ మురిగిపోయిన పేడకంపుకో ముక్కులు బిగదీసి శ్వాస ఆడ కుండాపోదు. అప్పటికింకా బాగా చీకటి పడలేదు. ఎక్కడ నుంచో ఒక నక్క వచ్చి ముందర వాకిట్లో నిలబడేసరికి పెద్ద కుర్రవాడు తోలాడుదాన్ని. నాలుగువైపులనుంచీ కీచురాళ్ళ మోత ప్రారంభమయింది. గోడమీదికి వాలిఉన్న ఎండు కొమ్మ మీదనుంచి ఏదో భయంకరమైన చప్పుడు వినిపించి జ్ఞానదా భయపడుతూ—"ఆకూసేది ఏమిటి అమ్మా?" అన్నది. అత్త ఆ మాట విని "తొత్తుకుడుతే అది" అంది.

జ్ఞానదా అది విని వణకిపోతూ "తోకేమిటి? తెలుగు సర్పమా ఏం కొంపతీసి?" అన్నది.

"ఆఁ, అదేనమ్మ! అది ఎవర్నో రాజును కరవాలని చెప్పి ప్రతి చెట్టుమీదికి ప్రాకుతూ ఉంటుంది" అన్నది అత్త. ఆ జవాబు విని జ్ఞానదా ఒకసారి తల్లి ముఖం కేసి చూసింది. అంతకు మును పనుంచీ ఆమె హృదయం అసలు దుఃఖ పరిపూర్ణమై ఉంది.

ఈసారి తల్లి ఒడిలోకి బోర్లగాపడి వెక్కి వెక్కి ఏడుస్తూ "ఇక్కడనుంచి పోదాం పద అమ్మా!—ఇక్కడ నేను ఒక్క నిమిషంకూడా బ్రతకలేను" అన్నది.

అత్త ఆశ్చర్యపోయింది. "భయమేముంది అమ్మాయీ! అది దేవత, ఎప్పుడూ ఎవ్వరికీ ఏమీ అపకారం చెయ్యదు. ఆ పాము కరిచి ఎంతమంది పోయినారేం మహా? భయం ఏమన్నా ఉన్నదీ అంటే అది ఒక మలేరియావల్లనే. ఒక్కసారి పట్టుకుందంటే ఇంక విడిచిపెట్టదు. ఈ సంవత్సరం ఈ జ్వరం మీ మామను పట్టుకుని ఇరవైరోజులయింది—ఈ లోపునే ఆయనెంత చిక్కి శల్యమైపోయారో చూశావుగా! ఇంకా కొన్నాళ్ళుపోతే ఎవరి గొంతులో ఎవరు నీళ్ళు పోయాల్సి వస్తుందో ఈ ఊళ్ళో అది చెప్పలేము" అన్నది.

జ్ఞానదా మనస్సులో అతులుడు చివరికి చెప్పిన మాటలు గుర్తుకు తెచ్చుకుని మెదలకుండా ఊరుకుంది. ఆమె ఆ రాత్రి ఒక్క కునుకయినా నిద్రపోలేదు. తల్లి హృదయం దగ్గరగా తలపెట్టుకుని పడుకుని మాటిమాటికి ఉలిక్కిపడ సాగింది. అలాగే తెల్లవారిపోయింది. కొత్త ప్రదేశంలో—

క్రొత్తవెలుతురు కంటపడటం ఆమెకు ఏమాత్రం సంతోషాన్ని కలిగించలేదు. పైగా ఆ వెలుతురు, ఆ గాలి—ఆ వాతావరణం యావత్తు ఆమెను నిన్నటిశిన్న నొక్కిపట్టుకుంటున్నట్లు తోచసాగింది.

ఇంతకూ వయస్సు వచ్చిన పెళ్ళికాని పిల్లను చూచి చుట్టుప్రక్కలవాళ్ళు మహా ఆశ్చర్యపోయారు. మా వంగదేశంలో పెళ్ళికాని ఆడపిల్లల వయస్సు యథాతథంగా చెప్పే సంప్రదాయం లేదు. తల్లి దండ్రులు అసలు వయస్సు కన్న ఒకటి రెండేళ్ళు తగ్గించి చెబుతారని అందరికీ తెలుసు. అంచేత దుర్గ పదమూడేళ్ళని ఎప్పుడైతే చెప్పిందో అప్పుడే అందరూ పదిహేనేళ్ళు అని నిశ్చయం చేసుకున్నారు. అదీకాక ఏకమాత్ర సంతానం అవటంవల్ల తల్లిదండ్రులు తాము తిన్నా తినకపోయినా పిల్లదాన్ని మాత్రం అబ్బురంగా పెంచారు. ఆమె దేహపుష్టి కూడా అనర్థక మయింది ఇప్పుడు. అది ఆమె యథార్థమైన వయస్సుకు బదులు ఇంకా ఎక్కువ యేళ్లు ఉన్నట్లు రుజువు చేస్తున్నట్లుంది.

ఇంకా రెండు రోజులయినా కాకముందే శంభుచటర్జీ ఏదో మాటా మాటా వచ్చి చెల్లెల్ని పిలిచి "పిల్లదాని మూలంగా వీధిలో తలయెత్తుకు తిరగటం కష్టంగాఉంది. మంచి సంబంధం ఒకటి ఉంది. ఇస్తావా?" అన్నాడు. "సంబంధం మాకు స్థిరపడే ఉంది. అల్లుడు సిద్ధంగానే వున్నాడు. ఇంక మరెక్కడా వెతకవలసిన పనిలేదు!" అన్నది దుర్గ.

"అయితే చిక్కేలేదు. కాని ఇంత మంచి వరుడు దొరకటమనేది ఎంతో అదృష్ట మనే అనాలి. ఆ మాట ఖచ్చితంగా చెప్పగలను నేను. ఇరవై పాతకెకరాల సుక్షేత్రమైన భూమీ, తోటా, చెరువూ, ధాన్యపు గాదె-చదువు సంధ్యల విషయంలో కూడా—"

దుర్గ అతడ్ని ఆమాట పూర్తి చేయనీయకుండానే "ఇంక మరో చోట చేయవలసిన అవసరంలేదు-ఈ ఏడాది వెళ్ళిపోగానే దాన్ని అతడికే ఇచ్చి వెయ్యాలి" అన్నది.

"కాని నాఉద్దేశం ప్రకారం-ఈ వచ్చేమార్గశిరంలోనే దాని కన్నె చెర తప్పించి ఒక అయ్యచేతిలో పెట్టి నదిలించుకోవటం మంచిది" అన్నాడు.

దుర్గ ఇంక నిరర్థకంగా వాదన చేసుకోకుండా "నాకు పనిఉంది" అనే వంకతో అక్కడినుంచి లేచి వెళ్ళిపోయింది. ఆ వరుడు శంభుకు ఈసంబంధం పెద్దబావమరిదే నని తెలిసింది. అతడికి భార్యపోయె అనుమానాలయింది. అంతవరకూ రికామీగా ఉండటంవల్ల-ఇహముందు అలా ఉండటం భావ్యంకాదని తోచింది అందరికీ. అదీగాక ఇంట్లో పిల్లాపీచు ఇంతంతవాళ్ళూ అంతంతవాళ్ళూ ఉడంటమూలంగా కొంచెం యీడుతప్పిన పిల్లయినా చాల అవసరమయింది ఇప్పుడు.

అంచేతనే కాబోలు దుర్గ ఎన్నిసార్లు అయిష్టత కనపరచినా ఆ వరుడు ఒకరోజున హఠాత్తుగా ఊడిపడ్డాడు. జ్ఞానదా ఎదురుగానే కన్పడింది. అతడు పిల్లను పసందు చేసుకునే మరీవెళ్ళాడని చెప్పటం అనవసరం. కొద్దిరోజుల్లోనే

చెల్లెలిమీాద శంభునాథ్‌కు ఉన్న ఆపేక్షా అదీ కఠినమైన యాతనలు పెట్టడంతగా పరిణమించింది.

ఒకరోజున యిహ స్పష్టంగానే చెప్పేశాడు. ప్రియనాథుడు పోయాడు. కనుక పిల్లదానికి యథార్థానికి సంరక్షకుడు తానేట! కనుక అంతదాకావస్తే వచ్చే మార్గశిరంలో తాను బలవంతంగానైనాసరే యీా పెళ్ళి చేయకలడట!

అన్నతో వాదించివాదించి దుర్గగదిలోకివెళ్ళి కూతురి ముఖంచేసి చూడగానే ఆపిల్లది ఈమాటలన్నీ విన్నట్లు గ్రహించింది. ఆమెకళ్ళు రెండూ ఎర్రగా జపాకుసుమాల్లా ఉన్నాయి. ఆమె వక్షానికి హత్తుకుని "నేను బ్రతికిఉండగా నీకు భయమెందు కమ్మా!" అన్నది పైకి. అభయమయితే యిచ్చిందికాని, భయంతో తనగుండెల్లోని రక్తంకూడా గడ్డకట్టుకుపోయింది. ఈ ప్రాంతంలో యిలా బలవంతంగా పెళ్ళిళ్లు చెయ్యటం అనేది అతిసామాన్యమైన సంఘటన అనేది తెలియని సంగతికాదు. తల్లివక్షంలో తలదాచుకుని కూతురు ఎక్కిళ్ళువచ్చేటట్లు ఏడవసాగింది. తల్లి ఆమె ఒళ్ళూ నుదురూ నిమిరిచూసింది. ఒళ్ళంతా జ్వరంతో పేలిపోతోంది. కన్నీళ్లు తుడిచి "జ్వరం ఎప్పటినుండీ వస్తోందే అమ్మాయీ" అని అడిగింది.

"నిన్న రాత్రినుంచి",

"నాకు ఎందుకు చెప్పలేదు! ఇవి భయంకరమైన మలేరియా రోజులు" అన్నది తల్లి.

కూతురు మెదలకుండా ఊరుకుంది, జవాబు చెప్పలేదు.

వదినగారితో దుర్గ యిప్పటివరకూ అంత చనువుగా ఉండామని ప్రయత్నించలేదు. వికటంగా ఉండే ఆమె ముఖమే కాకుండా వికటమైన ఆమె నవ్వు చూస్తే ఒళ్ళు మండిపో వటం అలా ఉంచి, అతికర్కశమైన ఆమె కంఠస్వరాన్ని కూడా సహించలేకపోయింది దుర్గ. పల్లెటూరివాళ్ళు సహ జంగానే కొంచెం బిగ్గరగా మాట్లాడతారు. కాని ఆమె మాటలు కొంచెం దూరాన్నుంచి వింటే పోట్లాడుకుంటున్నా రేమో అనిపిస్తుంది. ఆపైన ఆమె ఎంత వాగ్వైభవం కలదో అం యుద్ధవిశారదురాలు. ఆమెలో ఒక్క గుణం మాత్రం దుర్గ బాగా కనిపెట్టింది. ఆమె మీదపడిమాత్రం పోట్లాడదు ఎప్పుడూ. ఆమె మార్గాన ఆమెను పోనిస్తే ఎవరి జోలికీ రాదు. ఇల్లూవాకిలీ, పిల్లాజెల్లలతోనే సతమత మవుతూ ఉంటుంది ఎవరిసంగతీ చెవిని పట్టించుకోదు.

దుర్గామణి మొదట్లో రాగానే ఒకరోజున ఆమెకు వంటలో సహాయపడడానికి వెళ్ళింది, అప్పుడామె స్పష్టంగా "నువ్వు రెండురోజు లుండిపోదామని వచ్చినదానివి వదినా. నువ్వు పనులేమీ చెయ్యనవసరంలేదు. నేను యీ వంట యిల్లు కొట్టుగదీ ఎవరికీ అప్పగించను" అని అన్నది. అప్పటి నుంచీ దుర్గ ఒకవిధంగా నిశ్చింతురాలయింది.

ఇవాళ ప్రొద్దెక్కటం చూచి వదినగారు లోపలి గుమ్మంలో నిలబడి మామూలు గొంతుతో "ఇవాళ భోజనం అదీ ఏమీ లేదా ఏమమ్మా వదినా! వంటింట్లోనే కూర్చుంటావా ?" అని అడిగినది.

దుర్గ తలపైకిఎత్తి "పిల్లకి చాలాజ్వరమువచ్చింది వదినా మీారంతా భోంచెయ్యండి. మేం ఇద్దరం ఇంక ఇవాళ ఏమీా తినము" అన్నది "పిల్లదానికి జ్వరం అయితే నువ్వుతినటానికి ఏమమ్మా? జ్వరం ఎవరికిరాదు? తిను, లేచిరా' అన్నదామె. దుర్గ భయభయంగా "వద్దు వదినా! నన్ను తినమని బల వంతం చెయ్యకు—పిల్లది అలా ఒళ్ళు తెలియకుండా పడి ఉంటే నేను తినలేను" అన్నది.

"మీాదంతా మరీ విడ్డూరం" అంటూ ఆమె వెళ్ళి పోయింది. వంటయింట్లోంచి మళ్ళీ "జ్వరంవస్తే, వైద్యుణ్ణి పిలిపించి కషాయం పెట్టు. మలేరియా జ్వరానికి భోంచెయ్య కుండా ఉంటారా యెవరయినా? మా దేశంలో అలా లంఖ ణాలు చేసే అనుయాయితీ మేం ఎరగమమ్మా!" అంటూ ఆమె తన పనిని చూసుకోసాగింది మళ్ళీ.

అపరాహ్ణ సమయానికి ఆమె కొంచెం కషాయం కాచి తీసుకువచ్చి "ఇదిగో, లే, జ్ఞానీ! లేచి ఈ కషాయం కాస్త త్రాగు. త్రాగి ఇంట్లోకి లేచిరా," అన్నది.

అత్తఅంటే జ్ఞానదాకు అమితభయం. మళ్ళీ నోరెత్త కుండా ఆ కషాయం కాస్త త్రాగి వాంతిచేసుకుని, మళ్ళీ పడు కుంది. దుర్గ ఆ గదిలో లేదు. వాగితే చప్పుడుకు పనుగెత్తు కుంటూ వచ్చి ఈ వ్యాపారంచూసి మెదలకుండా నుంచుంది. అత్త కోపంతో మొల్లాల్లోకి పోయి నిలబడి, వాడవాడంతా వినపడేటట్లు "అంత దొరసానుల పోకిళ్ళున్న పిల్లని తీసుకుని మావంటి బీదవాళ్ళ యిళ్ళకు రావటం ఎందుకమ్మా?" అంటూ అరవటం మొదలెట్టింది.

అప్పటినుంచీ జ్ఞానదాకు అస్వస్థత క్రమశః ఎక్కువ కాసాగింది. వాళ్ళ భామినీఅత్త "ఈపల్లెటూళ్ళలో పాములు కరచి ఎంతమంది సస్తారేమిటి మహా? చచ్చేవా ళ్ళేవరయినా మలేరియావస్తే చావాలి. అది ఒకసారి పట్టుకుందంటే యింక విడిచిపెట్టలేదు" అని మొదటిరోజునే చెప్పింది. ఆవిడమాటలు యదార్థమేనని రుజువుకావటానికి ఎన్నాళ్ళో పట్టలేదు. కొద్ది రోజుల్లోనే జ్ఞానదా మంచంపట్టాల్సి వచ్చింది. ఆరోజున కార్తీక సంక్రాంతి. దుర్గ గదిలోకి వచ్చి చూచి ఆశ్చర్య పోయింది. భామిని జ్ఞానదా తలంపి దిక్కున తల నిమురుతూ కూర్చుని ఉంది. ఇంట్లో పనులన్నీ వదలిపెట్టుకుని ఇలాంటి వాటిల్లో జోక్యం పెట్టుకోవాల్సిన అవసరం ఆమెకు లేక పోవటం ఒకటి. అందులో పరాయివాళ్ళపిల్లకు ఇలా అయాచితంగా ఉపచారం చెయ్యటం ప్రకృతివిరుద్ధమైన వ్యాపారం కనుక – అన్నగారు ఇదివరలో తెచ్చిన పెళ్ళిప్రస్తావన విషయం జ్ఞప్తికి తెచ్చుకుని భయంతో లోలోపల శంకించ సాగింది. భామిని ఇలా ఆదరం చూపటం అందుకే అనటంలో సందేహం లేదు. ఆమె తన అన్నగారికి జ్ఞానదాని ఇచ్చి చెయ్యాలని భర్తకు సలహాయిచ్చి అతణ్ణి చాటునామాటునా ప్రోత్సాహపరుస్తోంది. ఈసంగతి మొదట్నుంచీ ఊహిస్తూనే ఉంది. భామిని ఇవాళ గొంతు కొంచెం తగ్గించుకుని "తారకేశ్వరంలో మంచి డాక్టరు ఒకాయన ఉన్నాడు. ఆయన్ని తీసుకురమ్మని మీ అన్నయ్యను పంపాను వదినా! రోజు రోజుకూ జ్వరం ఎక్కువవుతోంది. అది మంచిదికాదు" అన్నది. దుర్గ అవ్యక్తస్వరంతో అన్నమాటలు ఏవో అవి

సరిగ్గా వినబడలేదు. ఎంచేతంటే ఈ మంచివార్త విన్నప్పటికీ ఆమె మనస్ఫూర్తిగా ప్రసన్నురాలు కాలేదు.

భామిని ఏదో పనిమీద ఇంట్లోకి వెళ్ళిపోయింది. జ్ఞానదా దిండు క్రిందనుంచి ఒక ఉత్తరం బైటికి తీసి "జవాబు రాశారు" అన్నది.

"ఏదీ? చూడనీ, చూడనీ, అంటూ తల్లి ఆ ఉత్తరం ఊడలాక్కుంది. కాని మరుక్షణంలోనే ఆతురతను అణచుకొని ఉత్తరం గుప్పిట్లో పెట్టుకని మెదలకుండా కూర్చుంది. తీసి చదువుదామా అనుకుంది ఒకసారి. ఉహూం అది భావ్యంకాదు అని మళ్ళీ అనుకుంది. కూతురు చేతిమీదుగా, ఇచ్చింతే అయినా తల్లి అయివుండి తాను ఎలా చదువుతుంది? "అతులుడు ఏంరాశాడు?" అని అడిగిందిమృదువుగా.

జ్ఞానదా ఈలోపుగా అటు ఒత్తిగిలి పడుకుంది. "ఇక్కడకు రాకుండా ఉంటే బావుండేది ఇంతే" అని—అన్నది ముక్తసరిగా. ఉత్తరంలోని ఈ రెండు ముక్కలూ వినేసరికి తల్లికి కళ్ళవెంట అశ్రుబిందువులు రాలాయి, "రాకుండాఉంటే బావుండేది" అన్నమాటే ఆమె కూడా మనస్సులో పదేపదే ఆవృత్తిచేసుకో సాగింది.

అతులుడి ముఖం జ్ఞప్తికి తెచ్చుకుని అనేక విధాల ఆశీర్వదించి దుర్గామణి మాతృప్రేమతో విగళితురాలైంది. కుర్రవాడికి ఎంతటి అభిమానం. ఎంతటి వ్యథా. ఈ రెండు వాక్యాల్లోనూ గర్భితంగా ఉన్నాయో కదా! అని అనుకో సాగింది." జ్ఞానదా ఇక్కడికి వచ్చి జ్వరపడింది—అందుకనేగా కుర్రవాడు కోపంవచ్చి వీళ్ళ గంగాయాత్ర చూచి

పోదామని కలకత్తానుంచి వచ్చాను అని అన్నదీ! నిజమే”
నేను ఒక్కదాన్ని ఎక్కడికి వెళ్ళినా ఏంచేసినా అది వేరే
సంగతి. కాని నేను పిల్లనుకూడా వెంట పెట్టుకుని రావటం
అనేది ఏమాత్రం భావ్యంగా లేదు. ఎంత కష్టమయినాసరే,
సహించి మేము మాయింట్లోనే పడిఉన్నట్లయితే బావుండేది.
ఆ కాగితాన్ని ఎంతో ఆప్యాయంగా చేత్తో అటూ ఇటూ
త్రిప్పుతూ కూర్చుంటే ఆమెకు ఎన్నెన్నో సంగతులు గుర్తుకు
వచ్చాయి. భర్త మృత్యుశయ్యమీద అతులుడి ప్రతిజ్ఞకు,
ఆ గాజులు రెండూ ఇచ్చిపోదామని ప్రసాదం వంకపెట్టుకుని
రావటం. విశేషించి వచ్చేరోజున వాళ్ళ పెద్దఅత్తతో అతడు
తగాదా పడటం, మొదలైనవన్నీ గుర్తుకు వచ్చాయి. ఈ
సంగతి వాళ్ళ అమ్మకు తెలిసింది. వాడ వాడ యీవత్తూ
ప్రాకిపోయింది. అతడు ఎందుకు కలకత్తానుంచి పరుగెత్తుకు
వచ్చాడు? ఆనందంతో, గర్వంతో ఆమె మాతృహృదయం
ఉప్పొంగి పోయింది.

“నల్ల పిల్ల! మా నల్లపిల్లకు కలిగే గౌరవాన్ని అందరూ
చూస్తారుగా! అరె! కోకిలా నల్లటిదే. తుమ్మెదా నల్లగానే
ఉంటుంది” అనుకుంది మనస్సులో. “జ్ఞానదా! ఇప్పుడెలా
ఉందే అమ్మాయ్!” అని పిలిచింది.

“బాగానే ఉంది అమ్మా!”

“అవునే, నాసంగతి ఏమయినా రాశాడా అతులుడు?”

“చదివి చూచుకో అమ్మా!”

ఆమె కుతూహలాన్ని యింక ఆపుకోలేకపోయింది.
కిటికీదగ్గిరగా తీసుకువెళ్ళి కాగితం విప్పి చూసింది అంత పెద్ద

కాగితంలో రెండేపంక్తులు ఉండటంవలన కూతురు ఏకాగితం యిచ్చిందో అనుకుంది మొదట్లో. మరుక్షణంలో "శ్రీచరణేశు" అన్నమాట చదివి తనలో తాను నవ్వుకుని "అందుకనే చదవ మని యిచ్చింది - ఇది నాఉత్తరమే" అనుకుంది. "అప్పుడే చెప్పాను - ఆ ఊరు మలేరియా డిపో అని జ్ఞానదాకు జ్వరం వస్తున్నదని విని చాలా విచారించాను. త్వరలోనే మళ్ళీ ఆరోగ్యవతి కాగలదని ఆశిస్తాను. మేమంతా కులాసాగానే ఉన్నాం. నానమస్కారాలు స్వీకరించండి" అని రాసిఉంది.

దుర్గకు ఆమాట అడగటానికి కొంచెం సంకోచం కలి గింది. కాని తలి ప్రాణం-అడగకుండానూ ఉండలేకపోయింది. దగ్గరకువచ్చి కూర్చుని చిక్కు పడివున్న కూతురి జుట్టును వేళ్ళతో విడదీస్తూ మెల్లిగా "నీకు రాసిన ఉత్తరంలో అతు లుడు బహుశా కోపం కనపరచి ఉంటాడనుకుంటాను. కదూ అమ్మా?" అన్నది.

జ్ఞానద విస్మితురాలై ముఖం ఇటుత్రిప్పుకుని, "యిక నాకు ఉత్తరం ఎక్కడిదిఅమ్మా? నీకేగా రాసింది?" అన్నది.

దుర్గ కొంచెంగా నవ్వి "నేను చూడనులే. విని సంతోషిస్తాను. కోపం తెచ్చుకుని ఉంటాడని నేను గ్రహిం చాను" అన్నది.

"లేదు అమ్మా! ఆయన నాకు వేరే ఉత్తరమేమీ వ్రాయలేదు. రాసిందేమిటో అదే!" అని కూతురు మళ్ళీ ఒత్తిగిలి పడుకుంది.

"మొత్తం అంతా రెండు పంక్తులేనా! ఇంకేమీ వ్రాయలేదు?" అంటూ దుర్గ స్తబ్ధురాలయింది. ఇంతసేపటి

వరకూ కూతురితలలో ఆమె ఏ వేళ్ళయితే చిత్రవిచిత్రంగా విహరిస్తున్నాయో ఆ వేళ్ళు ఉక్కు వేళ్ళలాగా కాఠిన్యాన్ని వహించాయి యిప్పుడు. అలాగే ఆమె చాలాసేపు మెదలకుండా కూర్చుని లేచి వెళ్ళిపోయింది.

అలాగే మళ్ళీరోజులు గడుస్తున్నాయి.

౨

మార్గశిరమాసపు చలిగాలి ప్రారంభమయింది. దుర్గ చిన్నప్పటి స్నేహితురాలు ఒకామె పుట్టింటికి వచ్చింది. ఇవాళ మధ్యాహ్నం కూతురుకు కొంచెం కులాసాగా ఉండటంవల్ల ఆమెను చూసివద్దామని దుర్గామణి బైటికివచ్చింది. దారిలో పోస్టుజవాను ఎదురుపడేసరికి "ఆఁ. దాసూ? నా పేర రావలసిన ఉత్తరాలేవి అందటంలేదేం?" అని అడిగింది.

దాసు నవ్వుతూ "ఉత్తరాలు రాందే అసలు ఎక్కడీ నుంచి తీసుకువస్తానమ్మా?" అన్నాడు.

దుర్గ సందేహంతో "నా పేర కాని, మా అమ్మాయిజ్ఞానదాదేవి పేరగాని ఎవరికీ ఉత్తరాలేవీ రా లేదూ?" అని అడిగింది.

"వస్తే నేనుతీసుకువచ్చి ఇచ్చిపోతాను అమ్మగారూ!" అన్నాడు.

"కాదు దాసూ! నీసంచీమళ్లా ఇంకోసారి సరిగ్గాచూడు—వచ్చినా రావచ్చు. మూడుఉత్తరాలకూ జవాబు రాలేదు—మా అతులుడు అలాంటికుర్రవాడు కాడు."

దాసు అనవసరమైనశ్రమ పడకుండా "లేవు అమ్మగారూ! లేవు-వస్తే యిచ్చేవాడినే!" అనివెళ్ళిపోబోతూండగా

దుర్గ అడ్డువచ్చి "ఆఁ. దాసూ? అయితే ఒకవేళ ఇలాజరుగ ఉండొచ్చు. మీ పోస్టాఫీసులోపడి ఉన్నాయేమో? మీపోస్టు మాష్టరుగారు నాపేరుఎరగడు. ఒకవేళ టేబుల్ ప్రక్క అటు ఇటూ ఏమయినా పడి ఉన్నాయేమో మీ కెవరికీ కన్పించ లేదూ? నన్ను ఊళ్ళో అందరూ యెరుగుదురు. ఏం ? పోనీ నేను ఒకసారి వెళ్ళి వెతికి చూచుకోకూడదు!" అని అడిగింది.

ఆమె ఆదుర్దాచూసి దాసు జాలిపడుతూ "ఎందుకు చూసుకోకూడదు అమ్మగారూ!—కాని అది అనవసరంగా వెతకటం అవుతుంది. సరే పోనీ నేనేవెళ్ళి ఇంకోసారి వెతికి చూస్తాను. వస్తేమాత్రం వచ్చి యిచ్చి వెడతాను?" అంటూ అతడు కాలాన్ని యింక అట్టే వ్యర్థం చేసుకోకుండా వెళ్ళి పోయాడు.

"తల్లీ దుర్గా! అమ్మా కాళీ! ఒక ఉత్తరమయినా కని పించేట్టుచేద్దూ. జ్ఞానదాకు యింతజబ్బు చేసిందని వినికూడా అతడు వుత్తరం రాయకుండా వుంటాడా?" ఇది నమ్మవలసిన మాటేనా? అతడు తప్పకుండా రాసే వుంటాడు. ఎక్కడో గల్లంతు అయివుంటుంది" అని అనుకుంటూ వెళ్ళింది.

ఆహా ! ఏమి మానవుల ఆశ ! శతకోటి సంభావాసంభ వాలను ఊహించుకున్నా ఈలోపుగా అతులుడి మనస్సు ఒక వేళ మారిపోయిందేమో అన్న ఆలోచన దుర్గామణి మన స్సుకు ఒక్కసారి అయినా తట్టనేలేదు. అతులుడి ఈ వాంఛ ఒకప్పుడు అతడి మనస్సులో అతిగోప్యంగా వృద్ధిపొందుతూ వచ్చింది. ఆ వాంఛను యిలాంటి అసమయంలో నలుగురి యెదుటకూ తీసుకువచ్చి వ్యక్తంచేస్తే అదికాస్తా ఎండి చక్కా

పోతుందేమో ! యిప్పుడు అనేక విధాలయిన విరుద్ధశక్తులు ప్రకోపించి ఆ వాంఛను ఒక క్షణంలో నొక్కి చంపేస్తా యేమో ! అన్న సంగతికూడా ఆలోచించలేక పోయింది. మానవులు యింతే—యిలాంటి అంధులు!

దుర్గ కొంచెం పెందలాడే యింటికి తిరిగివచ్చి, కూతురి గదిలోకివచ్చి, "ఆఁ, జ్ఞా. దా! దాసు వుత్తరం గిత్తరం ఏమీ యిచ్చి వెళ్ళలేదుటే?" అని అడిగింది.

కూతురు కుంఠితస్వరంతో "లేదమ్మా!" అన్నది.

యిప్పటికి రెండు నెలలనుండి వుత్తరంమీద వుత్తరం మూడు వుత్తరాలు రాసినా జవాబురాలేదు. దుర్గ సంశయ క్షుబ్ధమైన కంఠంతో "బహుశా నువ్వు నిద్రపోతూ వుండి వుంటావు నువ్వుపలకకపోయేసరికి దాసు బహుశా తిరిగి వెళ్ళి పోయి వుంటాడు. నేనేమో యింట్లో లేకపోతినాయె! ఒక్క రోజు కాస్సేపు మేలుకుని కూర్చోకూడదుటే !" అంటూ ముఖం భారగించుకుని వెళ్ళిపోయింది. జ్ఞానదా మెదలకుండా ఊరుకుంది. ఆమె తాను నిద్రపోలేదు, మేలుకునే వున్నానని తర్కం పెట్టుకోలేదు. తల్లి నిత్యమూ అడిగే ప్రశ్నకు ఒకే ఒక సమాధానం చెప్పవలసి వస్తున్నందుకు సిగ్గుతో ఆమె తల భూమిలోకి కుంగిపోతోంది.

దుర్గ వెంటనే తిరిగివచ్చి, గుమ్మంబైట నుంచుని, "తాను వెతికి తీసుకువస్తానని దాసు ఎందుకు చెప్పాడు నాతో? యివాళ ఎందుకనో అతులుడిదగ్గరనుంచి తప్పకుండా వుత్తరం వచ్చివుంటుందని గట్టినమ్మకం ఏర్పడుతోంది" అన్నది.

కూతురు ఏమీ మాట్లాడలేదు. ఒక మాసిపోయిన బొంతలో తల దాచుకుని పడివుంది. కాని దుర్గ అంతటితో ఆగలేక పోయింది. ఆమె అన్నకొడుకును పోస్టాఫీసుకు పంపించి దాసు' అసలు రానేలేదన్న సంగతి తెలుసుకుంది.

తర్వాత మూడునాలుగు రోజులు ఉత్తరం వస్తుందేమో అన్న ఆశతో ముళ్ళమీద కూర్చున్నట్లు అహోరాత్రాలూ ఎదురుచూడసాగింది. అయినా ఉత్తరమేమీ రాలేదు. చివరకు హతాశురాలై అతులుడి తల్లికి ఒక వుత్తరం రాసింది. ఆవిడ సమాధానం సంక్షిప్తంగా అతులుడు కులాసాగానే వున్నాడనీ—కలకత్తాలో మెస్‌లో వుంటూ యిదవరకులాగానే చదువుకుంటున్నాడనీ రాసింది.

ఆమె వుత్తరంలో ఏదో విరక్త్యభావం వున్నట్లు తోచింది దుర్గామణికి. యిలా మార్గశిరం గడిచింది. పుష్యం గడిచింది. అతులుడి దగ్గిరనుంచి ఉత్తరం రాలేదు. మాఘమాసం సగంగడిచేసరికి కూతురుకాస్త కోలుకుంది. తల్లి మంచం ఎక్కింది, యింత పెద్ద నిరాశాఘాతాన్ని ఆమె సహించలేకపోయింది. అదీగాక వదినగారిమీద ఆమెకు వున్న విద్వేషానికి అంతులేదు. ఆమె పేరు ఎత్తితే అసహ్యంతో ఒకప్పుడు "కొరకంచు" అనీ "తాటకి" అనీ అంటూ వుండేది. రోజులు గడచినకొద్దీ ఆమెకు అసహ్యభావంకూడా ఎక్కువకాసాగింది. దానికి మరోకారణం వుంది ఆ "కొరకంచు" తన ధోరణిలో తాను స్వాభావిక మాధుర్యంవల్లనో ఏమో అపేక్షగానూ చూస్తోంది ఆదరించనూ ఆదరించుతోంది. కాని ఈ ఆదరణలో వుత్కటమైన ఒక స్వార్థపు వాసన వున్న

దని ఊహించుకునేసరికి ఆమెకు విషజ్వాల మరింత ప్రజ్వలించ సాగింది. చాలా కష్టాలుపడ్డ శరీరం ఆమెది. అంచేత చాలా వరకు సహించింది. కాని యింక సహించ లేకపోయింది. మాఘమాసం చివరకు వచ్చేసరికి ఆమె పూర్తిగా మంచం ఎక్కే స్థితిలోకి వచ్చింది. కూతురు ఏడుస్తూ "యింక వద్దు అమ్మా! యింటికి పోదాం పద, జరిగేదేమిటో అక్కడే జరుగుతుంది" అన్నది.

దుర్గ ఇష్టపడింది. ఆమె యిష్టపడకపోనటానికి తగినంత కారణం ఏమీ లేదిప్పుడు. కేవలం ఆ కొరకంచు ఆదరణలో నుంచి తప్పుకుని బైటపడటానికై ఆమె మనస్సు అహరహమూ ఆరాటపడుతోంది.

ప్రయాణానికి సన్నాహాలు చేసుకుంటున్నారని విని శంభు వెళ్ళటానికి వీల్లేదంటూ కూర్చున్నాడు. ఆరోజున ఉదయం ఏడున్నర, ఎనిమిదింటికి శంభు సంధ్యావందనం. జపంపూర్తిచేసుకునిటకటక బైటికివచ్చి 'దుర్గా!' అనిపిలిచాడు.

దుర్గ వసారాలో స్తంభాన్ని ఆనుకుని కూర్చుని ముఖం కడుక్కుంటోంది. జ్ఞానదా దగ్గిరే కూర్చుని ఉంది. అన్నగారి పిలుపుకు దుర్గ పలికింది.

"మీారిపుడు వెళ్ళటానికి వీల్లేదు" అన్నాడు శంభు.

"ఎందుకని అన్నయ్యా?"

"ఎందుకనా! మామూలంగా మాట ఇచ్చి చివరకు నేను మిథ్యాజన్మ వాడిని కానా? నాది అలాటి జన్మ కాదు."

అమాట ఏమిటో తెలియకపోయినా దుర్గకు మనస్సులో ఏదో భయం ఆవరించింది. మెత్తని కంఠంతో "ఎవ

రికి మాట ఇవ్వటం సంగతి అన్నయ్యా!" అని అడిగింది.

జ్ఞానిపెళ్ళిమాట. పెళ్ళిచెయ్యకుండాదాన్ని అలాయింక ఉంచలేను నేను. కనుక మా నవీనుడికి ఇచ్చి చేసెయ్యాలి. రేపు ఫాల్గుణ శుద్ధ పంచమినాడే ముహూర్తాలు పెట్టుకోవాలి. నగలూ అవీకూడా వాళ్ళేమీ లోవంరానీయరు. నేను చెబుతున్నానుగా! ఏదైనా చేశారూఅంటే వినేవాళ్ళకూ చూసేవాళ్ళకూ యింపుగా వుండాలికదామరి ?"

ఆమాటవినేసరికి నెత్తిన పిడుగు పడ్డట్లయింది. "నాతో చెప్పకుండా ఎందుకుమాట యిచ్చావు అన్నయ్యా? ఈ సంబంధం నా ప్రాణాలుండగా చెయ్యను" అని ఏడ్చింది.

శంభు మండిపడి "చెయ్యననగానే సరిపోతుందా యేం? నేను మేనమామను – నేను చెప్పింది అయితీరాల్సిందే ! నీమూలంగా నామాట తభావతు చేసుకుంటానా? అలాంటి తండ్రికడుపున పుట్టలేదు నేను — తెలుసా!" అన్నాడు.

ఈసారి దుర్గ బిగ్గరగానే ఏడ్చింది. "కాదు, అన్నయ్యా పిల్లదానిపెళ్ళి యిక్కడ చచ్చినా చెయ్యను నేను – నా కోసమై నువ్వేమీ దిగులు పెట్టుకోవద్దు-" అని కంఠం గాద్గదికం అవటం మూలంగా యిక ఆ పైమాట పూర్తి చెయ్యలేకపోయింది.

శంభు ఈ ఏడుపులు చూసి, మరీకోపం తెచ్చుకుని, పళ్ళు పటపటకొరుకుతూ "శుభకార్యాలపట్ల ఊరికే అనవసరంగా ఏడుస్తూ కూర్చోకు—అలా వీల్లేదు. అలా చెయ్యలేను—"

ఇంతలో రంగస్థలం మీదికి "కొరకంచు" రెండుచేతుల నిండా పేడతో వచ్చి సిద్ధమయింది. పశువులపంచలో పని చేస్తూచేస్తూవచ్చింది కాబోలు! మెల్లాలోకివచ్చి హఠాత్తుగా కంచు మ్రోగినట్లు గణగణలాడుతూ భర్తను వుద్దేశించి "అంత మంచివరుడు ఎవరూ? నేను విననేలేదు చెబుదురూ!" అన్నది.

శంభు భార్య ధోరణి చూసి ఖంగారుపడ్డాడు. కాని ముఖంలో ధైర్యాన్ని మాత్రం తొణకకుండా బిగబట్టుకుని— "ఎవరైతేనేం! ఎవరో ఒకరు...అది నీకెందుకు?"అన్నాడు.

ఆ "కొరకంచు" ఆ పేడచేతులు రెండూ త్రిప్పుతూ సగంమెల్లా యీావత్తూ నాట్యం చేసినట్లు గంతులేసింది. ఆ "సుమధుర" కంఠంతో వాడవాడ యీానత్తూ వులిక్కిపడేట్లు చేస్తూ "మామట మామ!" "మామ తనం" ఫలించేరోజు దగ్గరకు వచ్చింది. నవీనుడికిచ్చి చేస్తారా! అలా అయితే నూరురూపాయలబాకీ యివ్వనవసరం లేకుండా వడ్డీతో సహా తీరిపోతుందికదా అనా? అంతేగా! అందుకనే వాడు మంచి వరుడు "సుపాత్రుడు" అయినాడు! నిజమేనా! మా అన్న సంగతి నాకు తెలియదూ? కల్లు గంజాయి త్రాగి అయిదు గురు పిల్లలతల్లిని ఎనిమిది మాసాల గర్భంతో వున్న ఆవిడను పొట్టమీాద కర్రతో కొట్టి చంపేశాడు కదూ! – అవును అంతకన్న "సుపాత్రుడు" యింకలేడు. వురి పోసుకోటానికి బారెడు త్రాడు ఎక్కడా దొరకలా మీాకు? ఛీఛీ!" అన్నది.

శంభు చెల్లెలూ—మేనకోడలూ ముందర కోపాన్ని ఆపు కోలేకపోయాడు. కాలి పాంకోడు ఊడతీసి "నోరుమూసుకుం టావా లేదా దౌర్భాగ్యురాలా!" అని అరిచాడు.

ఆ "కొరకంచు" ఈసారి మరీ రేగిపోయింది. ఆమె భయంకరమైన భంగిమలో — ఆ భంగిమ కళ్ళతో చూసి తీరాలి కాని చదివితే తెలిసేది కాదు— "ఆఁ. నేను దౌర్భాగ్యురాలినా! ముఖం ఇటు త్రిప్పు - ఈ కొరకంచు నీ ముఖాన పెట్టకపోతే నేను పాంచూఘోషాల్ కూతుర్నే కాను బలవంతంగా చేస్తారేం పెళ్ళి? ఎందుకని? నీకేమిటి సంబంధం అంట? ఆవిడ రెండురోజులుండి పోదామని పిల్లను వెంటబెట్టుకు వస్తే గాత్రింబవళ్ళు ఏందుకూ ఆవిడ్ని అలా భయపెట్టడం? కత్తిపీట ఏదీ? ఎక్కడుందో చూపించు. నీ బావ మరది ముక్కు చెవులు కోసికాని విడిచిపెట్టను. నా పేరు "భామిని" అన్న సంగతిమాత్రం మరచిపోవద్దు" అన్నది.

ఆ ఉగ్రరూపంముందు శంభు ఇంక మాట్లాడ లేక ఇంట్లోకి వెళ్ళిపోయాడు..

భామిని అప్పుడు దుర్గామణివైపుతిరిగి "ఆయన నిజంగా ఓ యెలుగ్గొడ్డులాంటి మనిషి వదినా! మీరు ఇక్కడికి వచ్చినప్పటినుంచీ ఈ బంగారు బొమ్మను తీసుకెళ్ళి ఆ కోతికిచ్చి ముడిపెట్టి తన తాకట్టు ఎలా వదిలించుకోవటమా అని ఎత్తు వేస్తున్నారు. మళ్ళీ మామను ! అంటాను - మామట ! మామ!" అన్నది.

కొంచెం ఆగి కాస్త ఊపిరి తీసుకుని "చెబితే నీ మనస్సుకు ఎక్కడ కష్టం తోస్తుందో అని నేను చెప్పటం లేదు వదినా! పిల్లది జ్వరంతో చచ్చిపోతోంది, మంచి వైద్యుణ్ణి ఎవర్నయినా తీసుకురండి" అన్నాను. "నా దగ్గర అంత డబ్బు లే"దన్నారు.

నాదగ్గిర రెండు వెండికడియాలుంటే అవి రెండూ తాకట్టు పెట్టి డాక్టర్ని తీసుకరమ్మన్నాను. పైగా ఇంక నేను మామను అని చెప్పి ఉబ్బిపోతాడు. పాడుమొహం! నేను బ్రతికివుండగా భయమెందుకమ్మా వదినా? నేను ఇవాళే ఏర్పాట్లన్నీ చేస్తా. నువ్వు మీయింటికి వెళ్ళి పిల్లదానికి పెళ్ళిచేసేసి నీ యిష్టం వచ్చినప్పుడు మళ్ళీ వద్దువుగాని" అన్నది మళ్లీ భామిని.

దుర్గ గుంజను ఆనుకొని అలాగే కూర్చునివుంది—ఆమె కళ్ళుమాత్రం కాల్వలుకడుతున్నాయి.

భామిని కంఠస్వరం కొంచెం తగ్గించి ఎదురుగా లేని భర్తను ఉద్దేశించి "అనాధకదా అని ఆవిడమీద అధికారం చెలాయించటం దేనికి? పైన భగవంతుడు లేడూ? నేననేదినీకు ఉన్నదేదో దాంతో తృప్తిపడి తినరాదూ? ఇతరులను ఉపయోగించుకుని పొట్టనింపుకోవటం దేనికీఅంటా! అలాంటి వాళ్ళకు భగవంతు డెప్పుడూ మంచిచెయ్యడు" అన్నది.

ఆరోజున మధ్యాహ్నమే ప్రయాణానికి ఏర్పాట్లన్నీ పూర్తి అయినాయి.

బండి ఎక్కబోతూ దుర్గ భామిని కాళ్ళమీదపడి కన్నీటితో ఆమె పాదాలు తడిపేసింది. "వదినా! అన్నగారి భార్యవు నువ్వు. వయసుకు చిన్నదానివయినా వరుసకు పెద్ద దానివి. నిన్ను ఆశీర్వదించకూడదు నేను. కాని భగవంతుడు నిన్ను కనిపెట్టే ఉంటాడు. మా కోసమని నీ కడియాల జత కూడా పోగొట్టుకొన్నావు పాపం!" అన్నది.

భామిని పళ్ళు అన్నీ బైటపడేటట్లు నవ్వుతూ "పోదూ! పాడుకడియాలు!...లే. జబ్బుపడ్డ శరీరం. ఇంక అట్టేసేపు

నుంచోకు—వెళ్ళి బండిలో కూర్చో. జ్ఞానీ ! మీ మామ యింట్లో చాలా కష్టాలుపడి వెడుతున్నావమ్మాయీ! మళ్ళీ ఒకసారి రావాలి. మరిచిపోవద్దు సుమా?" అంటూ ఆమె చేతిలో బలవంతాన రెండురూపాయలు పెట్టింది.

బండి బయలుదేరుతుండగా దుర్గ కళ్ళు తుడుచుకుంటూ "తెలియక నీ ముందు చాలా అపరాధాలు చేసి ఉంటాను వదినా! అవన్నీ క్షమించు" అన్నది.

భామిని ఇంకా నోరంతా తెరుచుకుని నవ్వలేదు. పైగా చటుక్కున రెండుకన్నీటి చుక్కలురాల్చి అయ్యో! రాత! అపరాధాలుచేసింది నేనేవదినా! ఇదిగో జ్ఞానీ! నీఅత్త మీద కోపం తెచ్చుకోకు అమ్మాయీ! వచ్చే సంవత్సరాది పండుగకు మీరు ఇక్కడికి రావాలి. ఇదే పిలుపు అనుకో—అల్లుడ్నికూడా వెంట పెట్టుకుని రా అమ్మా!" అంటూ కన్నీళ్ళు తుడుచుకోసాగింది.

౬

కబురు చెయ్యాల్సిన అవసరం లేదనిచెప్పి దుర్గామణి ముందు ఉత్తరం రాయకుండానే వచ్చేసింది. జ్ఞానదా మొహం చూడకుండానే పెత్తల్లి నవ్వుతూనే రేగింది—"ఓసేయ్ జ్ఞానీ! నీబుగ్గలు రెండూ ఎక్కతీసి పంపార వేమే ఎవరైనా? తలఅంతా బట్టతల అయింది ఎంచేతనే? ఓయ్! చిన్నకోడలా? రా, చప్పునరా ఇలా, మన జ్ఞానసుందరిని ఒకసారి చూచి పోదువుగాని రా! మీఅత్తా మామా ఒంటికికూడా ముంత పొగవేసి పంపారా ఏమే!" అన్నది. జ్ఞానదా జవాబేమీ

చెప్పకుండా తలవంచుకుని మెదలకుండా కూర్చుంది. పినతల్లి రాగానే చటుక్కునలేచి ఆమెకు పాదాభివందనం చేసింది.

పినతల్లి వణికిపోతూ "ఇదేమిటే అమ్మా ఇలాఅయిపోయావ్?" అని అడిగింది.

పెత్తల్లి అన్నమాటలు అత్యక్కు లేమీకావు. వెదురు చెట్టులా ఎలావుందో! చీకట్లో చూశారంటే హడలిపోవాల్సిందే!" అంటూ నవ్వటం మొదలెట్టింది. కాని ఇవాళ పినతల్లి కూడా ఆమెతో ఏకంకాలేదు. ఆవిడ ఎలాంటిదయినా పిల్లల్ని కన్నతల్లిగా! చిక్కి శల్యమైన పిల్లదాని శరీరం కేసి, పాలిపోయిన ముఖంకేసి చూసేసరికి ఆతల్లి హృదయం శతధా విదీర్ణం కాసాగింది.

దగ్గరగా వచ్చి జ్ఞానదా ముఖం, తల నిమురుతూ ఒకొక్క సంగతే అడిగి జబ్బు సంగతంతా తెలుసుకొని నిట్టూర్పు విడిచి. "అలాఅయితే వెంటనే ఎందుకు వచ్చెయ్యక పోయావ్ తల్లీ? నేను మిమ్మల్ని ఇక్కడకు రావద్దని ఎప్పుడూ అనలేదుగా! మా చిన్నక్క ఎక్కడుంది?" అని అన్నది.

"అమ్మకు రైల్లో జ్వరంవచ్చింది- ఇంట్లో పడుకోబెట్టి వచ్చాను."

"రాదుమరి? చివరకు వెయ్యిచెప్పినా నేడు ఈఇంటికి పెద్దకోడల్నికదా! అంతకోపం తెచ్చుకుని వెడితే ఊరికే పోతుందా మరి?" అన్నది స్వర్ణ.

జ్ఞానదా తల్లిని చూడాలని చిన్నావిడ, జ్ఞానదా చెయ్యి పుచ్చుకుని లేచి నిలబడింది. పెద్దావిడ, మరీ మొహంమీద

అన్న ఈకటువైన మాటలు ఆమెకు మరీ అసహ్యాన్ని కలిగించాయి ఆమె సహించలేకపోయింది. "అక్కా! రెండేళ్ళ పాటు 'మధురసంక్రాంతివ్రతం' అయినా చేసుకుందూ! వచ్చే జన్మలో నయినా నీనోరు కాస్త పంచిదవుతుంది' అన్నది. తలవనితలంపుగా ఆమె వెలిబుచ్చిన ఈ ఉద్దేశానికి స్వర్ణ కోపంతో ఆశ్చర్యంతో చటుక్కున ఏమీ మాట్లాడలేక పోయింది. కాని మరుక్షణంలోనే తీవ్రస్వరంతో "మంచిదే! బాగుంది. ఇన్నాళ్ళకు చిన్నతోటికోడలిని చూసేసరికి ఏమైతే యేం నీకు దుఃఖం పొంగుకువచ్చిందన్నమాట. అమ్మో ఎన్ని నగలున్నాయి నీదగ్గర?" అంటూ గర్జించింది.

చిన్నావిడ జవాబు చెప్పలేదు జ్ఞానదా చెయ్యిపుచ్చుకుని ఆమె గదిలోకి వెళ్ళింది కాని ఆ వెళ్ళటం జ్ఞానదావిషయంలో మరణాంతకం అయింది. ఎంచేతంటే, తానుఅన్నా, తనతల్లి అన్నా స్వర్ణమంజరికి సహజంగా ఉండే కోపానికీ, ద్వేషానికీ అంతులేదు. ఇవాళ ఈ చిన్నావిడ ప్రవర్తనతో ఆ విద్వేషం అంతకన్న మరీ పెరిగిపోయింది.

హరిపాల్‌లో ఉన్నప్పుడు దుర జ్వరంవచ్చినప్పుడు పడిఉండేది. జ్వరంకొంచెం జారగానే లేచితిరిగేది. ఎలాగో అలాఫీలుచేసుకుని చెంబెడు వేడినీళ్ళు పెట్టుకుని ఒళ్లు తడుపుకుని జపం అదీ చేసుకుని, ఒకపూట కాస్త ఎంగిలి కూడా పడేది. కాని ఇక్కడకువచ్చాక మరోవిధంగా జరిగింది. ఆ వాడలో ఉన్న ఆడవాళ్ళంతా సానుభూతి చూపటానికై, వస్తూపోతూ నాలుగురోజులుదాకా ఆమెను మంచంమీాది నుంచి లేవకుండా చేశారు. నీలకంఠముఖర్జీ భార్య దుర్గను

చూసిపోదామనివచ్చి—ఆకాసంనుంచి హఠాత్తుగా ద్రొర్లి నంత హంగామా చేసింది. కళ్ళు రెండూ ప్రత్తికాయలంత చేసుకుని చూస్తూ 'ఇదేమిటి ఇలాచేశావ్ దుర్గా! పిల్లకు పెళ్ళి ఎప్పుడుచేస్తావ్ ఇంకా? దానిముఖంకేసి చూడకూడదు కూడా ఇంక!" అన్నది.

దుర్గ అలసటగాఉన్న కళ్ళు రెండూ మూసుకుని "ఏం చెప్పగలను పిన్నీ? భగవంతుడు కళ్ళుతెరిచి ఎప్పుడు చూస్తాడో మరి!" అన్నది క్షీణకంఠంతో.

'ఆసంగతి తెలుసుఅమ్మా! కాని ప్రయత్నంచెయ్యాలి కదా! భగవంతుడే వరుణ్ణికూడా వెతికి మనఎదుటికి తీసుకుని రాడుకదా!"

దుర్గ ఇంక జవాబు చెప్పలేదు.

ఆమె ఒక్కనిమిషం జవాబుకోసం ఎదురుచూసి, మళ్ళీ 'పుట్టింటికి వెళ్ళావాయె! మీ అన్నయ్య అయినా ఎక్కడా సంబంధంకోసం వెతకలేదూ? మరిది ఏమంటాడు?' అని అడిగింది.

'భగవంతుడికి తెలియాలి' అంటూ దుర్గ ప్రక్కకు వత్తిగిలింది.

మరొక గంటకు ఆదరిణి పెత్తనాలకనివచ్చి గుమ్మం బైటనుంచుని తొంగిచూస్తూ 'ఇవాళ ఎలావుంది దుర్గా?' అని అడిగింది.

జ్ఞానదా మంచంమీద కూర్చుని తల్లికి కాళ్లు ఒత్తుతోంది. 'జ్వరం ఇంకాజారలేదు' అత్తాఅన్నది. దుర్గ ఒత్తిగిలి చూసి 'కూరో్చ్చవదినా!' అన్నది.

'కాదులే. ప్రొద్దెక్కింది. ఇంక కూర్చోనులే, నేను చెబుతున్నాను దుర్గా! ఎవర్నో ఒకర్ని పట్టుకుని ఎలాగో అలా దాని కన్నె చెర వదిలించు. ఊరికే ఇంకా తాత్సారం చేస్తే కాదు. అనకూడదు-కాని యిదివరకు పిల్లదాని ముఖంలో కాస్తకళఅయినా ఉండేది కాని మలేరియా జ్వరంతో పొగచూరు కట్టెలా అయింది. అవునే జ్ఞానీ? ముందర జుట్టు అంతా ఊడిపోయిందా ఏమే?" అన్నది.

జ్ఞానదా తలఊగించి మెదలకుండా తల వంచుకుని కూర్చుంది. ఆదరిణి కంఠస్వరం తగ్గించి, "ఆ సిద్ధిస ఉండే గోపాలభట్టాచారి మళ్ళీ పెళ్ళి చేసుకుంటాడని వినికిడి. ఒక సారి నీమరిదిని అనాధుణ్ణి పంపించి ఎందుకు కనుక్కో కూడదు దుర్గా!" అన్నది.

"సరే చెబుతానులే" అంటూ దుర్గ నిట్టూర్చి మళ్ళీ గోడవైపు తిరిగి పడుకుంది.

ఇలా ఎంతమంది వచ్చి, ఎన్ని హితోపదేశాలు చేసి పోయారో లెక్కలేదు. కాని ఎవరు వస్తారు అని దుర్గ కని పెట్టుకుని కూర్చుందో—వాళ్ళు మాత్రం కంటపడలేదు. అతుల్యుడూ రాలేదు. అతడి తల్లీ రాలేదు.

చిన్నావిడకు కొంచెం దయా దాక్షిణ్యాలున్నాయి, కాని ఆవిడ మహాబద్ధకస్తురాలు. అందులో ఇప్పుడు గర్భిణి కూడా. అందుచేత స్వర్ణ జ్ఞానదాని పిలిచి, "రోగంఅని చెప్పి ఎప్పుడూ అలా కూర్చుంటే కాదుపిల్లా! మీఅమ్మఅంటే పోనీ ఓపికలేనిది అని అనుకోవచ్చు. నీకేం ఈడువచ్చినదానివి? ప్రొద్దున్నే మీ బాబయ్యకు అన్నంవండి కాస్త ఏదైనా చేసి

పెట్టలేవూ?'' అని అన్నప్పుడు చిన్నావిడ గదిలోంచి యీ మాటలువిని అన్యాయమని తోచినప్పటికీ మెదలకుండా ఊరుకుంది. ఇతరుల కష్టాలుచూసి ఆమె బాధపడుతుంది. కాని అలాచెప్పి తాను శ్రమపడి యితరుల కష్టాన్ని తొలగించటం అనేది ఆమె విషయంలోమాత్రం అసాధ్యం.

జ్ఞానదా వెంటనే ఇష్టపడి "నేనే చేస్తాను పెద్దమ్మా!" అన్నది.

ఇప్పటికీ జ్ఞానదాకు రాత్రిళ్ళు జ్వరం వస్తూనేఉంది. అయినా తల్లి మరింత బాధపడుతుందేమో యనిచెప్పి ఈ సంగతి రహస్యంగా ఉంచింది నీరసంతో నిర్జీవంగా వున్న శరీరాన్ని ఆమె ప్రొద్దున్నే మంచంమీదనుంచి కదిలించనే లేకపోతోంది. అయినా ఒక్కసారికూడా వెనకా ముందాడ లేదు - ఒక్కసారైనా ముఖం ఖారగించుకోలేదు.

పేదవాళ్ళయిన తల్లితండ్రులబిడ్డ అయినా ఆమె ఏక మాత్ర సంతానం. అంచేత ఎంతో గారాబంగా పెరిగినబిడ్డ. కాని చిన్నప్పటినుంచీకూడా పెద్దవాళ్ళుచెప్పిన మాటకు న్యాయమయినా అన్యాయమయినా తలఒగ్గటంలో, ఉపచారాలు చెయ్యటంలో ఆమెకు మరొకరు సాటిలేరని చెప్ప వచ్చు. కాని ఇవాళ ఆమె ఎంత గురుతరమైన భారాన్ని పైన వేసుకుందో—అది ఎవరూ గ్రహించలేకపోయినా చిన్నావిడమాత్రం గ్రహించింది.

అంచేత పెద్దతోటికోడలు ఇలా అన్యాయంగా ఆదేశించటం ఆమెకు లోపల మండిపోయింది. అయినా నోరు తెరిచి అల్లా వీల్లేదని అనడానికి సాహసించనూ లేక

పోయింది. ఒకవేళ అలా అన్నా వంశప్రకారం చీకటితో తానే లేచి వంటచెయ్యాల్సివస్తుంది.

మర్నాడు మామూలువేళకు పినతండ్రి స్నానాలగది లోకి వెళ్ళటంచూచి, జ్ఞానదా అన్నం వడ్డించడానికి వెళ్ళ బోయింది—ఎక్కడినుంచో పెత్తల్లి ఆ. ఆ. అంటూ పరు గెత్తుకుంటూ వచ్చి "ఎక్కడికి వెడుతున్నావ్ జ్ఞానీ ? అని అడిగింది.

జ్ఞానద నీళ్ళునములుతూ బాబాయ్ స్నానంచేసి వస్తు న్నాడుగా!" అన్నది.

"అయితే నీకేం?" అని నిన్ను వడ్డించవద్దు అని చెప్ప లేదూ నేను? నువ్వు వడ్డిస్తే మగవాళ్ళకు పనికివస్తుందా?" అని కేక లెట్టింది.

దుర్గ అప్పుడే లేచి ముందరకు వస్తోంది. ఈ కేక విని భయంతో చూస్తూ ఫూరుకుంది.

చిన్నావిడ గదిలోంచి బైటికివచ్చి "ఏం జరిగింది అక్కా?" అని అడిగింది

స్వర్ణ ఎవరికేసీ కన్నెత్తి చూడకుండానే - నోటమాట లేకుండా నిశ్చలంగా నుంచునిఉన్న జ్ఞానదాని చీవాట్లు పెట్ట సాగింది! "అన్నంవడ్డించి తీసుకువెళ్తే మీబాబాయ్ సంతో షించి నిన్ను నెత్తినెక్కించుకుని గంతులేస్తాడనీ, రాజపుత్రుడి కిచ్చి పెళ్ళిచేస్తాడనీ—అంతేకాదు నీ ఉద్దేశం? ఈ యీడుకే అప్పుడే మనస్సులుత్రిప్పడం నేర్చుకొన్నావ్? ఓలమ్మో!" అంటూ చేతిలో పళ్ళెం లాక్కుంది.

దుర్గ కుమిలికుమిలి చివరకు సహనాన్ని కోల్పోయింది.

కూతుర్ని ఉద్దేశించి ఏడుస్తూ పాడు మొహాందానా? పెద్ద వాళ్ళు చెప్పినట్లు విననిదానికి నీకు చావులయినా రాదేమే!" అన్నది.

జ్ఞానదా మెదలకుండా వంటయింట్లోకి వెళ్ళిపోయింది. ఈవిషయమై తనను ఎవరూ వద్దని చెప్పలేదనికూడా అన లేదు. తలయెత్తి ఎదురుజవాబు చెప్పటం బహుశా ఆ పిల్ల దానికి అసలు చేతకాదేమో!

అలా ఎదురుచెప్పకలిగింది చిన్నావిడ ఒక్కతే. కాని ఆమెకు పెద్దావిడసంగతి తెలుసు కనుక మెదలకుండా ఊరు కుంది. పెద్దావిడ ఎంతెలా వాగుతోందో అంత ఆత్మమర్యాద తెలియని మనిషి. ఆమెలో వెయ్యితప్పులు ఎదురుగా వేలెత్తి చూపినా సిగ్గుపడదు ఆవిడ. పైగా మరింత కాఠిన్యం వహించి యమయాతనలు పెట్టగలదు, అన్న సంగతి చిన్నావిడకు తెలుసు. అందుకనే మెదలకుండా జ్ఞానదాతో వంటయింట్లోకి వచ్చి, ఎంతో ప్రేమగా, ఆదరంగా ఆమె చెయ్యిపుచ్చుకుని "అక్క చెప్పినమాట ఎందుకు వినలేదు తల్లీ?" అని అడిగింది.

ఇంతవరకు ఎంతకఠోరమైన తిట్లయినా ఆమె సహిం చింది. కాని ప్రేమగా ఇలా మందలించబోవటం సహించలేక పోయింది. ఒక్కసారి కళ్ళుఎత్తి పింతల్లిముఖంకేసి చూసే సరికి ఆమె పాదాలక్రింద భూమి క్రుంగిపోతున్నట్లు అనిపిం చింది. "నాతో ఎవరూ వద్దు అని చెప్పలేదు పిన్నీ!" అంటూ బావురుమని ఏడ్చింది.

పింతల్లి దగ్గరకువచ్చి ఆమె కళ్ళు తుడిచింది. కాని ఈమెను ఎలా ఓదార్చాలోమాత్రం ఆమెకు బోధపడలేదు.

అదృష్టహీనురాలు, అవివాహిత అయిన ఆ పిల్లదాని రోజులు ఇలాగే గడచిపోతున్నాయి. ఇంటా, బయటా ఆత్మీయులూ, అనాత్మీయులూ అందరూ కలసి ఆమెను కేవలం చీవాట్లు వేయసాగారే కాని ఆమెను ఉద్ధరించాలని ప్రయత్నమయినా చేసినవాళ్ళు లేకపోయారు.

౭

ప్రస్తుతం దుర్గామణి ఎవరో ఒకరు పట్టుకుంటేనే కాని మంచంలోంచి లేవలేకపోతోంది. కూతురుతప్ప ఆమెకుమరో శరణ్యంలేదు అంచేత ఎన్నిపనులున్నా జ్ఞానదా మధ్యమధ్య వెళ్ళి కాసేపు తల్లిదగ్గర కూర్చుంటూ ఉండేది. ఇవాళ ప్రొద్దున్నే కొంచెం, తీరుబడిచేసుకుని తల్లిదగ్గర కూర్చుని మెల్లిగా వీపు నిమురుతోంది. చటుక్కున పరిచితమైన కంఠ స్వరం ఒకటి ఆమెను ఉలిక్కిపడేట్లు చేసింది.

ఆనాడే హోలీ, శెలవులు రావటంవల్ల అతులుడు కలకత్తానుంచి వచ్చాడు. ఇద్దరు ముగ్గురు స్నేహితులను వెంటపెట్టుకుని, చొక్కాల నిండా వసంతం చల్లుకుని "బుక్కాయ్" తో జేబులు నింపుకుని 'అత్తా' అని పిలుస్తూ ఇంట్లోకి వచ్చాడతడు.

దుర్గ మత్తుతో రోజంతా కదలకుండా అలాగే పడి ఉంటోంది. ఈ కంఠస్వరం చెవినిపడింవంటే తల్లికి ఎక్కడ మెళుకువ వస్తుందో అన్న భయంతో జ్ఞానదా కంగారుపడి పోతోంది. ఇతడి రాక కోసమే ఆమె మనస్సులో ఎదురు

చూస్తున్నదని జ్ఞానదాకు తెలుసు. ఆమెకు సహజ ధైర్యమూ గాంభీర్యమూ, ఆత్మమర్యాదా ఇప్పుడంతగా లేవు, విచక్షణా జ్ఞానంకూడా వికృతమై పోయిందిప్పుడు. ఇలాంటి తన తల్లి—కలహం అంటేనే చాలు భయపడేది—ఇప్పుడు అలాంటి కలహానికైనా సరే వెనుకాడటం లేదని జ్ఞానదా కనిపెడుతూనే ఉంది. కనుక వాళ్ళు ఉభయులూ కలుసుకున్నారంటే అశోభనమైన కలహం యివాళ అనివార్యమని ఆమెకు అంతరాత్మ చెబుతున్నట్లు తోచింది.

ఈ బెడద ఎలాగా తప్పించుకోనటమనేది ఎంత ఆలోచించినా ఆమెకు తోచలేదు. ఆమె తన అడుగులు చప్పుడు కాకుండా వెళ్ళి గదితలుపులు మూసిరాబోయింది. "జ్ఞానీ! అతులుడిమాటఅల్లేవుందే అది!" అన్నది తల్లి.

జ్ఞానదా వెనక్కి తిరిగివచ్చి, "ఏమోనమ్మా! ఆయన కాదు అనుకుంటాను" అన్నది.

"ఆఁ అతడు కాకపోవటమేమిటి? లేచివెళ్ళి ఒకసారి చూచి రారాదూ!"

తర్కిస్తూ కూచుంటే తల్లికి కోపంవస్తుంది అని తెలుసామెకు. అంచేత మెల్లిగా లేచివెళ్ళి తొంగిచూద్దామని ప్రయత్నించింది. కాని సరిగ్గా కనపడలేదు. వరండాలో చాలా మందితోపాటు ఆతడి కంఠస్వరంకూడా ఆమె చెవినిమాత్రం పడింది—అంతే. ఈ కాస్తకబురూ తెలుసుకుని ఆమె వెనక్కి తిరిగి వెళ్ళిపోవాల్సింది. కాని చాటుననుంచిని అతడి ముఖం చూడాలనే లోభం ఆమెను లాక్కెళ్ళింది.

ఆమె నిశ్శబ్దంగా ముందుకువచ్చి ఒక స్తంభం చాటున నుంచుని చూసింది. అతడు పెద్దత్త కాళ్ళమీద బుకాయించి నవ్వుతున్నాడు. అతడితో వచ్చినవాళ్ళుకూడా అది చూసి నవ్వుతున్నారు.

చిన్నావిడలేదు అక్కడ. ఆమెకు ఒంట్లో కొంచెం నలతగా ఉండటంమూలంగా ఇవాళ గదిలోంచి బైటికే రాలేదు. తిరిగివెడదాం—వెడదాం అనుకుంటూనే జ్ఞానదా తనకు తెలియకుండానే కొంచెం ఆలస్యంచేసింది. హఠాత్తుగా పిడుగుపడ్డట్టు స్తంభితురాలై చూస్తూనుంచుంది. తాను భయపడినంతా జరిగింది. తల్లి తూలుతూ తూలుతూ అటువైపే నడిచి వస్తోంది.

పరుగెత్తుకుంటూవెళ్ళి చెక్కపట్టుకుని వ్యాకుల పడుతున్న కంఠంతో 'అటు వెళ్ళనద్దుఅమ్మా! తిరిగిరా!' అన్నది.

దుర్గ కళ్ళెర్రజేసి 'ఎందుకని?' అని అడిగింది.

'ఎందుకా? ఏమోలే! నువ్వు వెనక్కి తిరిగిరా. ఇంక ఆశయేమీలేదుఅమ్మా!' 'నన్నువిడిచిపెట్టుదౌర్భాగ్యురాలా! విడిచిపెట్టు!' అంటూ దుర్గ అమానుషమైన బలంతో తనను విడిపించుకొని ముందుకు వెళ్ళింది. జ్ఞానదా యంత్రపు బొమ్మలాగా ఆమెను అనుసరించివెళ్ళి వెనకాలనుంచుంది. అందరూ ఆశ్చర్యపోతూ చూశారు దుర్గామణిని.

చిక్కి గుంటలుపడ్డ ఆమె ముఖంలో ఆకలిగొన్న వ్యాఘ్రదృష్టి కన్పిస్తోంది. ధగధగలాడిపోతున్న ఆమెకళ్ళకేసి చూసి అతులుడు భయంతో కళ్ళు క్రిందికి వాల్చుకున్నాడు.

"అతుల్! నీకు మేం మేము అపకారం చేశామనీ మమ్మల్ని ఇలా సర్వనాశనంచేశావ్!" అని అడిగింది దుర్గ.

అతులుడు ఏంచెబుతాడు జవాబు? అపరాధభారంతో తల అసలు పైకి ఎత్తలేక పోయాడు.

"ఆ పని స్వర్ణ చేసింది. హృదయమనే పదార్థం ఏమీ లేదు ఆమెలో. ఆమె అతిసహజంగానే ముఖం పైకియెత్తి "ఏం సర్వనాశనం చేశాడో చెప్పు చూద్దాం" అన్నది.

"నీకిం కేం జవాబు చెప్పగలనుఅక్కా! ఎవర్ని అడుగుతున్నానో అతడికి తెలుసు ఏంచేసిందీ!" అన్నది దుర్గ.

"మేమూ అన్న మేనమామ తినేది. కాని నీ కూతుర్ని చేసుకుంటానని వాడేమయినా కాయితంరాసిఇచ్చాడా ఇంత మందిలో పోట్లాటకు వచ్చావ్? వెళ్ళు ఇంట్లోకి వెళ్ళు. పండగపూటా సంతోషసమయంలో నా యింట్లో కూర్చుని ఏదో ఓఘాయిత్యం చెయ్యాలని తలపెట్టకు" అన్నది స్వర్ణ.

"ఓఘాయిత్యం చేద్దామనిరాలేదునేను అక్కా!"అని అతులుడివైపు తిరిగి. "మాకు ఈ సంవత్సరం అంతా ఎలా గడిచిందా నీకు తెలియకపోయినా భగవంతుడికి తెలుసు అతుల్. కాని నీ మనస్సులోని ఉద్దేశం ఇదే అయితే వారి మరణకాలంలో ఆశచూపింది ఎందుకు? ఈ సంగతి అప్పుడే చెప్పకపోయావ్?" అన్నది దుర్గ.

స్వర్ణ కోపంతో మండిపడుతూ "వాడికి భగవంతుడని చెప్పి బెదరించాలని చూడకు—బాగాఉండదు తెలుసా? మేం బ్రతికిఉండగా మాటయిచ్చేందుకు పెత్తనం వాడిది కాదు" అన్నది.

ఇంతమంది యెదుట అతులుడు తనను అవమానించి నట్లు భావించాడు. అత్త ఆసర్రాచూసుకుని "నేను పెళ్ళిచేసు కుంటాను అని మాట యిచ్చానా యేం? నాకాళ్ళు విడిచిపెట్ట లేదు-తలబాదుకోవటం మొదలెట్టింది. నా నోటిమీదుగా వాళ్ళనాన్నకు సాంత్వనవాక్యాలు చెప్పమంది. ఏంచెయ్యను! అంతమందిలో సిగ్గుతో చచ్చిపోయాను నేను. అంచేత కాళ్లు విడిపించుకోటానికి అలా ఒక ఎత్తు లేస్తే అది ఇహ మాట యివ్వటమేనా ఏం!" అన్నాడు.

స్వర్ణ కిలకిల నవ్వుతూ "ఓఅమ్మో! ఎంతఅసహ్యాకర మైన సంగతి ఏమిటిరా నువ్వన్నదీ. అదివచ్చి నీ కాళ్లు బట్టు కుని నిన్ను పెళ్ళి చేసుకోమని అడిగిందా? ఆఁ" అన్నది.

నిజమనో కాదో ●విశ్నే అడుగు. నా కాళ్ళమీంద తల బాదుకుందో లేనో చిన్నత్తే చెబుతుంది. లేకపోతే నే నా పిల్లను పెళ్ళిచేసుకోబోయానా? అంతకన్న చావాలంటే నా కెక్కడా గారెడుచేంతాడు దొరకదూ? అన్నాడు అతులుడు.

అతులుడి స్నేహితులు ప్రక్కకుతిరిగి నవ్వుకున్నారు. దుర్గ పిచ్చిఎత్తిన దానిలాగా "ఓరినిష్ఠురుడా! కృతఘ్నుడా! ఆ చేంతాడుముక్క నేనే కోసియిస్తాలే చావు నువ్వు నువ్వు చావటమే సబబు ఏపిల్లదాన్ని అయితే ఇంతమందిలోనూ నువ్వింత అవమానం చేశావో అదే ఒకప్పుడు నిన్ను యమ పాశాల్లోంచి విడిపించుకుని వచ్చిందిరా. మరిచిపోయావా ఆ సంగతులన్నీ?" అని అరిచింది.

ఈ కేకలు విని చిన్నావిడ తన అస్వస్థత మరచిపోయి తరుగెత్తుకుంటూవచ్చింది. "అయితే ఇదుగో దౌర్భాగ్యు

రాలా! వెళ్ళు నా యింట్లోంచి. ఫో, చెబుతున్నా!" అని స్వర్ణ ఎగిరి! మీదికి దూకటం చూసింది చిన్నావిడ.

జ్ఞానదా అక్కడే నుంచునిఉంది. కాని ఆమె చైతన్యం లేని శిలావిగ్రహంలా అయిపోయింది. సిగ్గు, అసహ్యం, అభిమానం, అవమానం, మంచీ, చెడు ఇవేవీ ఆమెకు స్ఫురించలేదు. ఆమె వీటి అన్నిటికీ అతీతురాలై గ్రుడ్లప్పగించి అలాగే చూస్తూ కూచుంది. అదృష్టపూర్వకమైన ఈ విగ్రహంకేసి చూడగానే చిన్నావిడభయపడి, ఒకసారి కదిలించి "జ్ఞానదా!" అని పిలిచింది. ఆవిడ గదిలోనుంచే ఈకలహం కొంతవిన్నది.

"ఎందుకు పిన్నీ?" అన్నది జ్ఞానదా.

"ఇంక ఎందుకు నుంచున్నావ్ అమ్మాయీ ? మీ అమ్మను ఇంట్లోకి తీసుకువెళ్ళు."

"అమ్మా! వెడదాం, పద" అంటూ తల్లిని పట్టుకుని మెల్లిగా ఆమెను లోపలికి తీసుకువెళ్ళింది.

"చూశావా చెల్లీ ఆ అతిశయం ! చందమామకోసం పొట్టివాడు చేతులు చాచటం, అని ఇలాంటివాన్నే అంటారు. అన్నది స్వర్ణ.

అతులుడు నవ్వుతున్నట్లు పళ్ళు బైటపెట్టి "విన్నావా చిన్నత్తా ఈ రభసంతా? ఎంత సిగ్గుమాలిన పని!" అన్నాడు.

స్వర్ణ ఝుమాయిస్తూ "ఇంతపిల్లఉందోలేదో-ఇదెక్కడి ఘోరకలి అంటా!" అన్నది. చిన్నావిడ కొంచెంగా నవ్వి, "ఘోరకలి కనుకనే బ్రతికిపోయాం అక్కా! లేకపోతే మరో సత్యకాలమే అయినట్లయితే తల్లి భూదేవి సిగ్గుతో రెండుగా బద్దలయేది అతుల్" అని గదిలోకి వెళ్ళిపోయింది.

స్వర్ణ ఈ వెటకారంలోని తాత్పర్యాన్ని గ్రహించలేక పైగా సంతోషిస్తూ "అమాట నేను అంటున్నాని చెల్లీ!" అన్నది.

కాని అతులుడిముఖంమాత్రం నల్లపడపోయింది. చిన్నావిడమాటల్లోని వెటకారం స్వర్ణ గ్రహించలేకపోయినా అతడుమాత్రం గ్రహించాడు. అంచేత కాస్సేపు అలాగే స్తబ్ధులా కూర్చుని లేచి వెళ్ళిపోయేటప్పుడు ఈ హోలీపండుగ తాను కట్టుకున్న బట్టలకు ఎర్రరంగుపూసి, మొహానికి కాటుక పులిమిపోయిందా అన అనిపించింది మనస్సుకు.

అసలు సంగతి ఇంతవరకూ గోప్యంగానే ఉందికాని ఇహా బైటపడింది ఇరుగుపొరుగు హితకాంక్షులు చలవవల్ల అతులుడికి ఈయింటితో సంబంధం ఏర్పడిందన్న సంగతి దుర్గ చెవినపడింది. అనాథుడి పెద్దకూతురు మాధురిని అతడికిచ్చి చెయ్యాలని నిశ్చయమయింది. ఈసంబంధం స్వర్ణ కుదిర్చింది. పిల్లనుచూసి అతులుడు కూడా మనస్ఫూర్తిగా ఇష్టపడ్డాడు.

మాధురి చిన్నప్పటినుంచీ కలకత్తాలో మేనమామ దగ్గరఉంటోంది. మహాకాళీ పాఠశాలలో చదువుతుంటోంది. ఇంగ్లీషు, సంస్కృతం, బెంగాలీ నేర్చుకుంది. పాడటం, హార్మోనియం వాయించటం, కార్పెట్లు అల్లటం కూడా నేర్చుకుంది.

అదీగాక చాలా అందంగా కూడా ఉంటుంది. ఈసారి పూజా శెలవులకు రెండునెలలు ఉండిపోదామని తల్లిదండ్రుల దగ్గరకువచ్చింది. ఆవచ్చినప్పుడే ఈసంబంధం స్థిరపడింది. అతులుడి వంటి వరుడు ఎంతప్రయత్నించినా లభించుట మనేది

అతిదుర్లభం. అలాంటిది అతడే స్వయంగా ఇంటికి వచ్చాడు. అయితే ఈ విషయంలో మధ్యవర్తిత్వం అంతా స్వర్ణది.

చిన్నావిడ పుట్టింటివారు కొంచెం మంచిస్థితిమంతులు తల్లి బ్రతికేఉంది. కూతుర్ని పురిటికి ఇంటికి తీసుకురావటానికై మనిషిని పంపింది. ఆ వచ్చిన వారితోపాటు మాధురి కూడా వచ్చింది. చిన్న పెత్తల్లిని ఆ పిల్ల చూచి చాలా రోజు లయింది. అంచేత రాగానే ఆమెకు నమస్కరించి పోదామని వచ్చింది.

"ఆయుష్మతీభవ!" అని ఆశీర్వదించి దుర్గ కన్ను ఆర్పకుండా అలాగే చూస్తూ ఉండిపోయింది. అసలే సౌందర్యవతి, అందులో అత్త చక్కగా అలంకరించి పంపింది. అత్త కలకత్తా నివాసిని కనుక ఆడపిల్లలను ఎలా అలంకరించాలో ఆమెకు తెలుసు. ఆ పిల్ల దానికేసి చూస్తూంటే దుర్గకు కను రెప్పలు క్రిందికి వ్రాలలేదు. చటుక్కున దీర్ఘ నిశ్వాసతో పాటు "ఆహా! పిల్లకాదు బంగారపుబొమ్మ!" అన్నమాటలు కూడా ఆమె నోట్లోంచి బైటికి వచ్చాయి. వెంటనే తన పాదాలు దగ్గిర కూర్చునిఉన్న కళాకాంతులులేని—కూతురి ముఖంకేసి చూసేసరికి ఆమెకళ్ళు రెండూ భగ్గుమన్నాయి. ప్రక్కకు ఒత్తిగిలి అతికటువుగా "ఆఁ నేనూ కన్నాను ఆడ పిల్లను. ఎందుకు? గుడ్లగూబ మొహం!" అన్నది.

మాధురి గదిలోకి రాగానే ఆ పిల్ల అందమూ అలంకారమూ చూసి జ్ఞానదా తన హైన్యానికి సంకోచంతో భూమిలోకి క్రుంగిపోయింది. "అక్కా! కాస్సేపు మాట్లాడుకుందాం. రా" అన్నది మాధురి.

దానికి సమాధానంగా జ్ఞానదా అవ్యక్త స్వరంతో ఏమన్నదో తెలియలేదు. కాని ఆమెనోట మాట్లాడినట్లు వినపడ్డ సవ్వడికే దుర్గ కటువుగా "పాడు మొఖం యింక ఎవ్వరికీ చూపించకే జ్ఞానీ! కూర్చో, అక్కడ" అన్నది. జ్ఞానదా నిశ్శబ్దంగా కూర్చుండిపోయింది.

మాధురి వెళ్ళిపోయాక దుర్గమనస్సులో మండుతున్న మంటమూలంగా కాబోలు ఒకటి రెండుసార్లు "ఉస్! అబ్బ!" అనుకుంది. జ్ఞానదా మెల్లగా "కొంచెం తల ఎత్తనా అమ్మా!" అని అడిగింది.

"వద్దు"

"మందు యివ్వనా?—"

వద్దే! వద్దు, వద్దు. ఛో, నామంచం మీదనుంచి లేచి పో దౌర్భాగ్యురాలా! నీముఖంకేసి చూస్తే నాకు ఒళ్ళు మండిపోతోంది" అంటూ కాలితో కూతుర్ని గట్టిగా త్రోసేసింది.

జ్ఞానదా ఎన్నైనా సహించగలిగింది. కానీ ఈత్రోపు సహించలేకపోయింది. మెల్లిగా అక్కడినుంచి లేచివచ్చి క్రిందచాపచుట్టగా పడిపోయింది. ఆమె కళ్ళవెంట కారుతున్న నీళ్ళతో క్రిందనేలంతా తడిసిపోయింది. చేతులు రెండూ ఏదురుగా చాచి, మనస్సులో "భగవాన్! నేను ఎవరికి ఏం దోషం చేశాననీ, అందరికీ యిలా కంటిలో నలుసునయి పోయాను? నాకు అందంలేదు. నగలూ— చీరెలూ లేవు. నాకు తండ్రిలేడు. ఇవన్నీ నా దోషాలేనా? రోగగ్రస్తమై శల్యమైన నా యీ శరీరమూ, పాలిపోయిన నా ముఖమూ

మరొకవ్యక్తిని ఆకర్షించలేకపోతే అది నా దోషమా? నాకు పెళ్ళిచేసేందుకు ఎవరూలేరు. అయినా నావయస్సు మాత్రం పెరుగుతూనేవుంది—అదికూడా నా అపరాధమే! ప్రభూ! నాదోషాలు ఎన్నైనా ఉండనీ - అయినా నన్నుమాత్రం మానాన్న దగ్గరకు పంపించు. ఆయన నన్నెప్పుడూ త్రోసి పారెయ్యడు" అని విలపించింది.

జ్ఞానదా!" అంటూ దుర్గ యిటు ఒత్తిగిలింది. తల్లి పిలుపు విని ఆపిల్లది కళ్ళు తుడుచుకుంటూ కంగారుగా లేచి కూర్చుంది.

"జబ్బుబుళ్ళు. తడినేలమీద ఎందుకమ్మా!" అంటూ ఆదుర్దాతో తల్లి లేచికూర్చుంది.

"ఓ! తిట్టాను!దూ నిన్ను?" అంటూ క్షణంలో రెండుచేతులూ చాచి కూతుర్ని దగ్గరకు తీసుకుని గుండెలకు హత్తుకుని ఏడవసాగింది.

ఇవాళ చీకటిపడ్డాక అనాథుడు హఠాత్తుగా దుర్గామణి గదిలోకివచ్చి విచారముఖంతో "ఇవాళ ఎలా ఉంది వదినా? పడుకో. పడుకో. లేవకు. మందూ మాకూ ఏమీ పుచ్చుకోటంలేదని విన్నాను. అలా అయితే కోలుకోలేవు" అన్నాడు.

ఆమాట నిజం. మందు ఇవ్వటానికయితే ఇస్తున్నారు. కాని అది యివ్వకపోయినా వచ్చినఇబ్బంది ఏమీలేదు. ఆమె మందుపుచ్చుకోవటం బొత్తిగా మానేసింది. ఆమె బ్రతుకు కావాలనే ఆశా లేదు. బ్రతకాలనే వాంఛాలేదు. కంఠస్వరం ఆనాటి కానాటికి మరీ క్షీణించిపోతోంది. బాగా దగ్గరకు

ఏ స్త్రైనేతప్ప ఆమె మాట్లాడితే వినపడటంలేదు. అయినా అవ్యక్తంగా చెప్పినజవాబును అనాథుడు తలవొంచి చెవిదగ్గిర పెట్టుకుని విని అదినిజమే వదినా! విధవఅయి బ్రతకటంవల్ల లాభంఏముందీ? – ఏ హిందువు కాదంటాడు ఈ మాటను? అయినా ఆత్మహత్య చేసుకోకుండా కొన్నాళ్ళపాటు సంసారంలో ఉండక తప్పదుకదా! నీశరీరం ఇలాంటి స్థితిలో ఉన్నప్పుడు నేను ఈమాటలు చెప్పకుండా ఉండటమే భావ్యం, కాని చెప్పకుండా ఊరుకునేందుకూ వీల్లేకుండా వచ్చింది.

"కనుక నేను అనే దేమిటంటే–నేను ప్రయత్నలోపం ఏమీ చెయ్యకపోవటం నువ్వూ చూస్తూనే ఉన్నావుకదా! కాని అది దౌర్భాగ్యురాలు! ఏదీ ముడిపడింది కాదు. ఆరేడు సంబంధాలు—ఒకటీ కుదిరిందికాదు. దీన్ని చూస్తే ఎవరికీ ఇష్టం కలగటంలేదు" అన్నాడు.

దుర్గ ఏమీ మాట్లాడలేదు. అనాథుడు కాస్సేపాగి మళ్ళీ చెప్పటం మొదలెట్టాడు. "చిన్నన్నయ్య పోయాక నువ్వు మా యింట్లోనే ఉంటున్నావుగా! దాని మూలంగా పెద్ద గందరగోళం వచ్చిపడింది. నీలకంఠ ముఖర్జీని ఎరుగుదువుగా! ఇంటింటికీ వెళ్ళి యాగీచేస్తున్నాడు: మిమ్మల్ని వెలివేసినట్లు ఎలా త్రోసిపారెయ్యగలను నేను? అసలు వాళ్ళను మాత్రం ఎలా తప్పుపట్టగలం. మన పిల్ల వయస్సు మనకికన్పిస్తూనే ఉన్నదిగా! పట్నవాసంలో అయితే ఇలాంటివాళ్ళు ఉండరు—అదీ చెబుతున్నాగా! పాడుపల్లెటూరు అయిపోవటంవల్లనే మనని గురించి ఇంత హంగామా, ఇంత చర్చాను." అని పెద్ద నిట్టూర్పు విడిచాడు.

మరిది చెబుతున్న ఈ ఉపోద్ఘాతం దేనిని గురించో, ఇది చివరకు ఎలా పర్యవసిస్తుందో అంతు తెలుసుకోలేక దుర్గ అలాగే నిశ్శబ్దంగా చూస్తూ ఊరుకుంది. కాని బక్కచిక్కిన ఆమె ముఖంలో భయచ్ఛాయలు కన్పిస్తున్నాయి.

ఒకసారి సకిలించి, గొంతు సవరించుకుని, కొంచెం వెనకాముందాడి అనాధుడు ఈసారి అసలుసంగతి బైట పెట్టాడు. "ఈ స్థితిలో నువెక్కడికైనా వెళ్ళాలన్నా రావాలన్నా కష్టమే. నేను అదికాదు చెప్పేది. కాని ఏం చెయ్యగలను వదినా! మా అమ్మాయికికూడా పెళ్ళి యీడు వచ్చిందికదా! అంచేత నే ననే దేమిటంటే నాలుగు వైపుల నుంచీ నాకూ ప్రమాదం రాకుండా చూసుకోవటం అవసరం-కనుక నేను అనేది ఏమిటంటే జ్ఞానిని ఈసమయంలో ఎక్కడికయినా పంపించివెయ్యకపోతే వీల్లేదు. ఈఇంట్లో ఇంకదాన్ని ఉంచటానికి వీల్లేదు. పెద్దగందరగోళంఅవుతుంది" అన్నాడు.

దుర్గ క్షీణకంఠస్వరం పెదవులుదాటి పైకి రాలేదల్లే ఉంది—"అది ఎక్కడికి వెడుతుంది మరిదీ?"

"హరిపాల్ కే వెళ్ళనియ్."

"అక్కడికి ఎలా వెడుతుంది? వెళ్ళినందువల్లమాత్రం వచ్చే లాభం ఏముంది మరిదీ?"

అనాథుడి కీసారి కోపం వచ్చింది. "ఇది నీది కేవలం అన్యాయం చిన్నవదినా! కేవలం మీఒక్కరి సంగతీ చూసుకుంటేకాదు. ఎవరియింట్లో ఉంటున్నారో-ఆపదలో ఎవరు తీసుకువచ్చి బాధ్యత పైన వేసుకున్నారో-వాళ్ళ బాగోగులు కూడా కొంచెం చూడాలి మరి!" అన్నాడు.

దుర్గ జవాబు చెప్పలేకపోయింది. ఒక్క నిట్టూర్పు మాత్రంవిడిచింది. ఆనిట్టూర్పు కొంతవరకు పనిచేసింది. అది చూచి అనాథుడు తనకంఠస్వరాన్ని కొంచెంమెత్తగా మార్చుకుని 'ఈస్థితితో నీకుకొంచెం ఇబ్బందేఅవుతుంది. ఆ సంగతి నేను గ్రహించాను. కాని గత్యంతరంఏముందీ? అదీగాక నీతప్పుకూడా కొంతవున్నదిలే వదినా! మీా అన్నయ్యకు ఉత్తరం రాశాను. ఆయన స్పష్టంగా రాశాడు. ఆయన అక్కడ పెళ్ళికి కావలసిన ఏర్పాట్లన్నీచేస్తే అసంభవమయిన ఆశలన్నీ పెట్టుకుని, కోపంతో నీఅంతటనువ్వే వచ్చేశావు. అలా చెయ్యకపోయినట్లయితే ఇప్పుడు సులభంగా'—

సులభంగా ఏంజరిగేదో అదిమాత్రం అనాథుడు విడమర్చి చెప్పలేదు. ఇవాళ హఠాత్తుగా జ్ఞానదాను పంపించివెయ్యాలనే ప్రసక్తి అతడు ఎందుకు తీసుకువచ్చాడో దుర్గా, మణి గ్రహించింది. ఏమాత్రం హంగామా చెయ్యకుండా ఒక్కదమ్మిడీ ఖర్చులేకుండా ఈభారాన్ని వదిలించుకునేందుకు ఉపాయం దొరికితే అలాంటి సదవకాశాన్ని జారవిడుచుకునే, మనిషికాదు అనాథనాథుడు.

అతడు వెళ్ళిపోయాక కాస్సేపటికి ఇంట్లో పనులు పూర్తిచేసుకుని జ్ఞానదా గదిలోకివచ్చి తల్లిస్థితిచూసి, భయంతో వులిక్కిపడింది. రక్తసూన్యములై గుంటలుపడి ఉండే ఆమెకళ్ళు ఎర్రగాఉన్నాయి ఇవాళ. కూతుర్ని చూసేసరికి ఆమె దుఃఖం సహస్రముఖాలుగా పొర్లుకువచ్చింది. సైగతో దగ్గిరకు పిలిచి, కూతురి వక్షస్థలంమీాద తలపెట్టుకుని తల్లి ఇవ్వాళ పసిపిల్లలా వెక్కి వెక్కి ఏడ్చింది.

చాలాసేపటికి ఆమె ఏడుపు తగ్గాక 'నాసంగతి నీకు తెలియదా అమ్మా? ఎవరయితేమాత్రం నన్ను నీనుంచి దూరం చెయ్యగలరా? అది ఒక్క బాబాయి ఇల్లేకాదు. మన యిల్లుకూడా. ఆయన తిండిపెట్టకపోతే చివరకు ఆయనే సిగ్గుపడాల్సివస్తుంది—ఎలాగో అలా నీకు నేను తిండిసంపాయించి పెట్టగలను' అంటూ కూతురే తల్లిఅయి, తల్లిని చిన్నపిల్లలా ఒళ్ళోపెట్టుకుని ఓదార్చసాగింది. కాస్సేపట్లోనే అలసటగా ఉండడంవల్ల తల్లి నిద్రపోయింది. కాని జ్ఞానదా రాత్రి చాలా ప్రొద్దుపోయేవరకు మేల్కొనేఉన్నా 'ఎలాగో అలా' అన్నది, ఎలాగో స్థిరీకరించుకోలేకపోయింది. ఈ దుర్దినాలలో తల్లికి తాను ఎలాఎక్కడనుంచి తీసుకొచ్చి తిండిపెట్టి పోషించగలదు!

జ్ఞానదాను పంపించివెయ్యటం సంగతి చిన్నావిడవిని, భర్తను చాటుకు పిలిచి 'నీకు మరీ వార్ధక్యంమీదపడి మతి చెడిపోయిందల్లే ఉందే! వదినగారి సల్లహాల్లో ఈ అసమయంలో తల్లిదగ్గరనుంచి కూతుర్ని దూరంగా పంపుతానని చెప్పివస్తారా లేకపోతే? కసాయివాళ్ళకైనా మీకన్న కాస్త దయాదాక్షిణ్యా లుంటాయి. వాళ్ళేనయం' అని చివాట్లు పెట్టింది.

ఏమయితేయేం-ఈపని అసంభవమని చెప్పి అనాథుడు మొదలకుండా ఊరుకున్నాడు. లేకపోయినట్లయితే ఈ విషయాల్లో అతడు స్త్రీకి వశుడు. ఇంత పెద్దదోషారోపణ ఎంత శత్రువయినా అతడిమీద మోపగలిగేవాడు కాదు.

ఇదిజరిగిన రెండోనాడు దుర్గ మరిదిని తనగదివద్దకు పిలిపించుకొని దార్గద్యంగా "నాయనా! నువ్వు నాకు మరిదివి. నాకన్న చిన్నవాడివి. అందుకే నీచేతులు పట్టుకొని చెప్తున్నాను. పెద్దవాడివి అయితే నీకాళ్ళు పట్టుకోటానికిగూడ నాకు సంశయంలేదు. అనాధబాబూ! నాకు వున్నదే ఒక్కగాను వొక్కబిడ్డ. నేనా చావుబతుకుల్లోవున్నా. ఇలాంటి సమయంలో, నన్ను నా కూతురునుండి వేరు చేయబోకు. నిన్ను నేను కోరేది యిదే!,, అన్నది.

జ్ఞానదా చేతులు అనాధనాధుని చేతుల్లోఉంచి కంట నీరు పెట్టింది దుర్గామణి. అతడు తనచేతులను చప్పున వెనుక్కులాక్కుంటూ అన్నాడు.

"వదినా నాశక్త్యానుసారం నేనూ ప్రయత్నిస్తూనే యున్నాను. కానీ వూరుకోటంలేదు. ఐనా జీవంలేనివాడు కూడ నీపిల్లను వివాహం చేసుకొనుటకు వొప్పుకోటంలేదు. ఈసంగతులు నీకు తెలియనివికావు. ఈ విషయంలో నన్ను బాధించుటే నీపనిగా యున్నది. నీచర్యవల్ల నేను. నాపిల్లలు యేవిధంగా బాధలుపడినా నీకు జాలిలేదు. మెదలకుండా మీారు యిక్కడవుంటే జరిగే ఆకాస్తనష్టం మాకుటుంబానికి వస్తుందనేగా నీయభిప్రాయం. ఇంతేగా వదినా?" అన్నాడు.

మరది ధోరణికి భ్రమంగిపోయిన దుర్గ వళ్ళుతెలియని చికాకుతో జ్ఞానదావున్న గదివైపుకువస్తూ జ్ఞానదా! జ్ఞానదా! అని బిగ్గరగా పిలచింది.

అన్యమనస్కంగావున్న జ్ఞానదా యేదో చెప్పబో యింది. ఇంతలో "నిన్ను మృత్యువుకూడా తనవద్దకు తీసు కోటానికి భయపడుచున్నది ఇలాంటి భాగ్యంగల నీకు ఇంకా ఆత్మాభిమానంకూడానా? లోకంఅంతా ఈసడిస్తున్నా, నీవు చావవుగా!, మూడురోజులు జ్వరం వచ్చిందోలేదో అఘో షుగారి కొడుకు బంగారపుబొమ్మ పాపం చనిపోయాడు! కానీ సంవత్సరంనుంచే చలిజ్వరం నిన్ను పీక్కుతింటున్నా నీకుమాత్రం చావురాదు. సిగ్గూశరంలేకుండా ఇంకా బతుకు తున్నావు. ఇంకొకతయితే ఈపాటికి ఆత్మహత్య జేసుకోదూ! ఛో ... ... ముందు నాయెదుటనుంచి బయటికి...ఛో... హాయిగా వుంటుంది నా ప్రాణానికి. క్షణంకూడా నన్ను స్థిమితంగా కూచోనీకుండా, రాత్రింబగళ్ళు నాప్రాణాలను జలగలాగా పీక్కుతింటున్నావు ... ... కదలవేమే పాడు ముండా? ఆలాగుడ్లుమిటకరించుకు చూస్తావేం?"

నిజంగా ఆమెకు ఆత్మాభిమానమేవుంటే ఏనాడో ఆత్మహత్య చేసుకుని వుండేదే! కానీ జ్ఞానదా ఆపనిచేయలేదు భూదేవివలె సమస్త అవమానాలు నిశ్శబ్దంగా దిగమింగి, ఇంటిపనులలో దిగపడిపోయింది. ఇలాంటి సంఘటనలు చాలా సార్లు జరిగాయి. కానీ ఒక్కమారైనా జ్ఞానదా!... అమ్మా చావట మేలాగో నాకు తెలియకపోలేదు. ఆపనిచేసే ధైర్యం నాకు లేకపోలేదు. అదినన్ను యింతకన్న కష్టపెట్టదనీ నాకు తెలుసు. వీటి నన్నిటినీ యెందుకు సహిస్తూవున్నానో!... నేనుచచ్చిపోయి నిన్నింకా కష్టములలో పడత్రోయటం యిష్టంలేకనే బ్రతుకుతున్నాను." అని చెప్పలేదు,

సాయంత్రం ఇంటి చాకిరి అంతా అయింది. తులసి కోటవద్ద చిన్నదీపం వెలిగించి పెట్టింది జ్ఞానదా. ఇంతకాలము నుంచి మనస్సును పీకుతున్న విచారం పెలుచూచుకొని ఒక తడవ వెల్లుబికింది. ఆమె రెండు చేతులూచాపి తులసి కోటకు సాష్టాంగబడి 'భగవంతుడా! ఇక్కడే మానాన్నగారు చని పోయారు – మా అమ్మను ఆయన వద్దకు తీసుకుని వెళ్ళు. మేమీ బాధలను కష్టాలను సహించలేము. ఇక మాశక్తులు సన్నగిలుతున్నాయి'' అని తులసిని ప్రార్థించింది.

చైత్ర పూర్ణిమ వెళ్లింది. ఈ బహుళపక్షం పదిహేను రోజులు శుభకార్యాలకు మంచిరోజులు కావంటారు పెద్దలు.

ఈ కారణంచేతనే దేవరాణీ పుట్టింటికి వెళ్ళటం ఆగి పోయింది. శుక్లపక్షంవచ్చింది. చంద్రకళలు క్రమేపీ వృద్ధిలో పడ్డాయి. దేవరాణి చిన్నన్నగారు ఆమెను ఆమె మేనకోడలగు మాధురిని వాళ్లవూరు తీసుకెళ్లెందుకు వచ్చాడు భోజనాలు చేసి వెళ్లెందుకు యేర్పాట్లు జరుగుతున్నాయి. అప్పుడు అతులుడు యెందుకో అక్కడికి వచ్చాడు. స్వర్ణ అతులుడిని భోజనానికి ఆహ్వానించింది.

అతులుడు దేవరాని చిన్నన్నగారు పీటలమీద భోజనానికి కూరుచున్నారు. స్వర్ణమంజరి వాళ్ళకు కొద్దిదూరంలో కూచుని మాధురిచే వడ్డన చేయించుచున్నది. ఉదయమే జ్ఞానదాచేత వంటచేయించింది. వడ్డనకు రావద్దని ఆర్డరు వేసింది స్వర్ణమంజరి ఆజ్ఞ యెందుకు జరిగినా, జ్ఞానదాకు మంచిదే అయింది. ఆమెచాలా రోజులనుండి యెవరికంట బడటానికి

పాడలిపోయి బెదరిపోతున్నదీ అవును ఏసమయంలో ఎవరు ఏమి అంటారో! అందుకే యెవరి కంటాపడకుండా తప్పుకు తిరుగుతున్నది. ఈమెకు కావలసింది ఇప్పుడుయిదే!

మాధురికి అతులునికి వివాహాము అవుతుందనీ, మాధురిని కలకత్తాకు తీసుకు వెళతారనీ, బ్రహ్మాండంగా ఆ పిల్లను అలంకరించారు. ఆపిల్లవడ్డనలో యెప్పుడన్నా సిగ్గుపడితేపొంచి కూమని వున్న పెదతల్లిగారు. ఛీ! అదేవిటమ్మా! చిట్టి తల్లీ భరనాలేదులే! పో! అది వెయ్యి యిది వెయ్యి! ఇలాంటి పాత్రపోషణా వాక్యములను గారాబం పుట్టిబడే మాటలతో, చిరునగవులతో పొంగి పోతూవుండేది అదేసమయంలో లోకంలో గల సర్వప్రాణిచేత యేవగించ బడుతున్న మరొక యువతి వంట యింటి మూలమూలలకునక్కి, కావలసిన పదార్థములు వడ్డించే మాధురికి అందిస్తున్నది.

స్వర్ణమంజరి మాధురి పెళ్ళి తాలూకు జరగవలసిన విషయాలు వినోదాలు నుచ్ఛటిస్తున్నది. మాధురి సిగ్గుతో వడ్డించేదల్లా అనతలకు జారుకుంటున్నది ఇదిచూచి జ్ఞానదా 'నీకేంకావాలి, చెల్లీ' అన్నది.

'నాకేం అక్కర్లేదు అక్కయ్యా! ఇక నేను వడ్డించ లేను. నావల్ల కాదు,' అని ఖాళీగావున్న ఆ వడ్డనవళ్ళెంను క్రింద పెట్టింది.

ఒక క్షణం గడచినతరువాత 'అమ్మాయి లవణాంత్తే' అని పిలచింది స్వర్ణ. ఈపిలుపు వినపడ్డా వెళ్ళలేదు మాధురి. 'మాధురీ! ఏంచేస్తున్నావమ్మా వుప్పులేదని నీ చినమామగారు

అన్నం తినాని కూచుంటేను"— ఈ మాటకుకూడా మాధురి మాట్లాడలేదు.

జ్ఞానదా ఇక వుండలేక ముట్టుకున్నంత మాత్రంచేత వుప్పొ మయులపడే పదార్థంకాదని వచ్చి వడ్డించిపోతే పెత్తల్లి "నీవు ఏమైనావని" చివాట్లు వేస్తుందేమో అని ఆమె పిలుపు తనకుకూడా వర్తించవచ్చుగదా! అని, చిరుగుల చీరెతో జాగ్రత్తగా ఒళ్ళు కప్పుకొని ఉప్పుగిన్నెతో వాకిలి దాకా వెళ్ళింది. భోజనం చేస్తున్నవారు ఛాయలుచూడలేదు. స్వర్ణమంజరి మాత్రం చూచి భగ్గున మండిపోయి యెదుటి వారు వినిన బాగుండదని కొంత తమాయించుకొని, అణగని మంటను అణుచుకొని నిదానంగా అన్నది.

"నిన్ను తెమ్మన్నది ఎవరు? మాధురి అక్కడలేదా!"

"ఎందుకు పెద్దమ్మా ఎక్కడికో వెళ్ళిందే!"

"ఓహో! తమరు అందుకని దయచేశారూ, ఈ ముఖంతో ఇక్కడికి ఇలా రావటానికి నీకు సిగ్గులేదుటే ! నీ దరిద్రపు మొఖాన్ని చూపించ కని నీకు లక్షసార్లు చెప్పానా! నామాట జ్ఞాపకం లేనట్లు, అతులుడు ఇక్కడభోంచేస్తున్నాడు కదా! నీ సౌందర్య ప్రదర్శనకని ఉప్పు వంకతో వచ్చావన్న మాట. జాగ్రత్త! ముందు గిన్నె నాచేతికిచ్చి నీవు అటు చాటుకుచావు. జ్ఞానదా అలాగే వెళ్ళి చాటున వొదిగింది.

స్వర్ణమంజరి స్వహస్తాలతో వుప్పు వడ్డన కావించి, తాపీగా కూచుని, అతులుడిని మోజుగాచూస్తూ "బాబూ!

మొగవాళ్ళు సిగ్గుపడతారా? భోజనం చెయ్యి...తిను పదార్థాలు బాగా వున్నయ్యా? అయ్యో! అలా...తలవంచుకుని కూర్చున్నావేం! అతుల్?"

ఇంతలో దేవరాణి అన్నగారు "అక్కాయ్! ఆ పిల్లేది? అన్నాడు. "ఆ! ఎవరూలేరు. మీరు భోజనంచేయండి" మామూలు ఈ వ్యంగ్య ధోరణితో ఆయన్ని సమాధానపెడదామని చూచింది స్వర్ణమంజరి. కానీ అన్నం సయించలేదు. తినలేకపోయాడు.

మాధురిమీదగల ప్రేమతో, ఇంటిల్లపాది చూపుతున్న ఆదరణలతో జ్ఞానదావిషయం మరచినట్లు తలచాడు కొంతకాలం, కాని ఆవిషయంలో నిజం మరొకవిధంగా వున్నది. అతని హృదయకుహారంలోగల ఒకదుర్గంలో జ్ఞానదా ఓమూల గాఢంగా తేవిణీ వేసియున్నది. తననిగూర్చి ఆమె అభిప్రాయాలను యిప్పుడు చెప్పలేదు. ఆధరాధిక్యముచే తననుఆదిరిస్తుందో అసహ్యించుకొంటున్నదో కానీ ఒకప్పుడు ఆమె తనను ప్రేమించింది. అతనూ స్వీకరించాడు. ఆకారణంగా తనను సేవించింది. ఈ విషయాన్ని అతను ఎట్లా మరవగలడు. ఆరోజుల్లోను ఆమె అతని యెదుటబడేదికాదు. ఇప్పుడూఅంతే. ఇలాంటప్పుడు యిటువంటి నిందను జ్ఞానదాకు అంటకడితే అతను ఎలా సహిస్తాడు.

దేవరాణి కూతురుతోకూడా పుట్టింటికెళ్ళింది. పోబోయే ముందు దుర్గామణిని చూచికూడా పోలేదు. జ్ఞానదా వంట ఇంట్లోకి నబడ్డది. ఆమెచేతిలో పదిరూపాయలుపెట్టి,దొంగవలె

యెవరన్నా చూస్తారేమో యని చప్పున బయట పడ్డది. జ్ఞానదా ప్రతి నమస్కారం పెట్టింది. ఇది ఆమెచూడలేదు.

ఆయింట్లో అందరిలో కొంత దయగాచూచే తన పింతల్లి లేదు, వెళ్ళిపోయింది. అనేసంగతులు జ్ఞానదాను భయ పెట్టినవి. పినతల్లి ఏయేవిధంగా ఉపకరించిందో ఏయేవిషయా లలో వ్యతిరేకించిందో జ్ఞానదాకు తెలియకపోలేదు. ఈమెను కష్టాలలో ఆదుకుని ఆదరించేది. ఆమె యిప్పుడు సమీపంలో లేదు. ఇది జ్ఞానదా వ్యథ.

వైశాఖమాసం సగంగడిచింది. ఒకరోజున అనాథ నాథుడు ఆఫీసుకు వెళ్ళేసన్నాహంలో ఉన్నాడు. పెద్దవదిన అతని వెనకవైపుగా వచ్చినుంచుంది. ఆమెకళవళికలుయేమో మాట్లాడవలెననిగా ఉన్నాయి. ఇతనికి భయంవేసింది. "ఏమిటి వదినా?" అన్నాడు.

ఏమైనా నువ్వూ నేనూ చెయ్యగలిగింది ఏమీలేదు. మన దుర్గామణి సంగతి—.

అనాథనాథుని చేతిలో హుక్కా పట్టుతప్పి కిందపడ్డది. తెలీని స్థితిలో "ఆ!!" అన్నాడు.

"ఏమిటీ వదినా! ఆమెస్థితి అందాకావచ్చిందా! నాకు తెలియదే! అని తొక్కిసలాడాడు. స్వర్ణమంజరి కొంతసేపు కొయ్యబారినా చివరికి మాటపెగల్చుకొని "ఇంతమాత్రానికే ఇంత కంగారుపడతావేమయ్యా! ఆమె యింతలోనే చావదు. ఎక్కువకాలం బ్రతుకుతుందని ఆశాలేదు మహా అయితే ఇంక పదిపదిహేనురోజులు ఇలాగే వెళ్ళతీస్తుందనిఅనిపిస్తుంది.

అవునుకానీ! ఆమె పోయిన సంవత్సరంవరకో, ఆరుమాసముల వరకో పిల్లకు పెండి చేయకూడదుగా! వచ్చే ఆషాఢమాసము లల్లో మాధురికి వివాహం చేదామని వున్నది. ఈవిషయంలో నాకు యితరుల సలహా అవసరములేదు. ఇటువంటి సంబంధం అన్నప్పుడల్లా దొరుకుతుందా! ఏమియిచ్చినా, ఏమియివ్వక పోయినా పట్టించుకోను. పిల్లవాని కా పిల్ల యిష్టమే. ఇలాంటి అవకాశం విడువను" అన్నది.

అనాధనాథుడు "ఈయింటికి నువ్వు పెద్దవి. మాధురి నీకూతురే, దానిని నువ్వు యెవరికియిచ్చినా యివ్వతగిన దానివే! ఈవిషయంలో అన్ని అధికారాలు నీవే"అన్నాడు.

స్వర్ణ సగర్వంగా "అలాగేఅని తెలుసునాకు. ఇది వరకు ఎప్పుడూ నేను చెప్పినదానికి కాదని అననూ లేదు. అలాంటి మరదివికాదు నువ్వు. అందుకనే ఇప్పుడు నేను చెప్పి నట్లు చెయ్యమంటున్నాను. ఇంకతాత్సారం చెయ్యకు. ఎవ డికో ఒకడికి దాన్నికూడా అంటకట్టి, ఆబెడద వదలించుకో. ముందు ఆపెళ్ళిచెయ్యనిదే మాధురిపెళ్ళి చెయ్యటానికి వీలుం డదు ఇప్పుడే వాడవాడంతా వెయ్యిరకాలుగా అనుకుంటు న్నారు. అప్పుడిహ నానాగందరగోళమూ అవుతుంది. బాగా ఆలోచించిచూచుకో, నీయింటో చచ్చినశవం — ఎలాగో అలా బైటకు తీసుకెళ్ళి పారెయ్యకపోతే కుళ్ళువాసనతో అంతా చావాలి" అన్నది.

ఆ మాటలే ఆలోచించుకుంటూ ఆఫీసుకు వెళ్ళిపో యాడు అనాధుడు. అంచేత ఇహ మర్నాటినుంచీ ఈ శవాన్ని

ఇంట్లోంచి ఎలాగో అలా వదిలించుకోవటానికి హడావిడి పడుతూ నలుగురయిదుగురు వరులను వెతుక్కువచ్చాడు. వాళ్లు ఎలాంటివాళ్లు అంటే వాళ్ళనుగురించి పరిచయంచేయ టానికి స్వర్ణకుంజరికూడా గుటకలు మ్రింగాల్సి వచ్చింది. అంత దౌర్భాగ్యాలన్నమాట !

ఆ రోజు మధ్యాహ్నం—చాలారోజులకు-స్వర్ణ దుర్గ గదిలోకివచ్చి "ఇవాళ ఎలాఉంది?" అని అడిగింది.

దుర్గ అశికష్టంమీద ప్రక్కకు ఒత్తిగిలి చెయ్యి వెల్ల కిలవేసి, "ఇంకా ఎలా ఉండటమేమిటి అక్కా? ఇంక ఆట్టే రోజులు అవస్థపడకుండా దాటిపోయేట్లు ఆశీర్వదించు అన్నది.

స్వర్ణ సానుభూతినటిస్తూ "ఆఁ ఆఁ భయమేముంది? నయంకాక పోవటమేమిటి?" అన్నది.

దుర్గ మెదలకుండా ఊరుకుంది. ఆమాటకు ఎదురు జవాబుచెప్పలేదు. స్వర్ణఅప్పుడిహ అసలు మాట చెప్పింది. "పిల్ల పెద్దదికనుక" వరుడుకూడా చిన్నవాడయినా ఫిల్లేదు చెల్లీ! తల్లి తండ్రిలేరు. అందుచేత ఆతడే స్వయంగా చూట్టా నికి వస్తాను అని కబురుచేశాడు— తల్లి తండ్రులు అమరులు కాకపోతే ఆ వరుడికి ఆ వయస్సులో వాళ్లు బ్రతికి ఉండటం అసంభవమని చెప్పనవసరంలేదు. ఇప్పుడయినా మహాకాళి దయవల్ల పిల్లనుచూచి అతడు ఇష్టపడితే మరిది ఇంత శ్రమ పడి తిరుగుతున్నందుకు సార్థక్యం కనబడుతుంది. తర్వాత ఇహ ఇచ్చిపుచ్చుకోటాలసంగతి అంటావా? నా ఉద్దేశం ఏమంటే—"

ఆమెమాట ఇంకాపూర్తి కాకముందే దుర్గ ఆదుర్దాగా లేచికూర్చుని, కళ్ళనిండా నీళ్ళు తెచ్చుకుని చూస్తూ "ఈ సంబంధమయినా బెడిసిపోకుండా ఆశీర్వదించు అక్కా ! నా కళ్ళతో చూసి అయినాపోతాను" అని అంటూ ఉండగానే అశ్రువులు తొణికి క్రింద పడ్డాయి.

ఆశీర్వదించక పోవటమేమిటి నేను? పిల్లదానికి ఏదో ఒక ఒడ్డు చూపించు భగవాన్ ! అని అహో రాత్రులూ తపస్సుచేస్తున్నాననుకో. నువ్వు చూడకపోవటమేమిటి? నేను చెబుతున్నానుగా ! నువ్వు అల్లుడిముఖం చూశాక కాని .."

దుర్గ నిశ్శబ్దంగా పైటచెంగుతో కళ్ళు ఒత్తుకుంది. స్వర్ణ ఒకసారి ఆవులించి, చిటిక వేసి కొంచెం వెనకా ముందాడి—"పిల్లాజల్లా ఉన్నవాడు రెండువందలు జీతమన్న పేరేకాని మరేంలేదు. నీకు అన్నీ తెలిసిన సంగతులేగా ? తనకూతురి నెత్తిన ఆ దోసెడు తలంబ్రాలూ ఎలా పోయించటమా అనే దిగులుతో కొయ్యబారి పోతున్నాడు. ఆ పైన ఇది ఒకటి. అంచేత మరిది ఏమన్నాడంటే—అతడు సిగ్గు మూలంగా స్వయంగా నీతో చెప్పలేక పోతున్నాడు—నీ భాగంఇల్లు తాకట్టు పెట్టకపోతే ఈ ఖర్చులకు డబ్బు దొరికేట్టులేదు. నువ్వేమీ చెయ్యనక్కర్లేదు. ఊరికే సంతకం చెయ్యటంవరకే ఊరికే చేబదులుక్రింద ఇవ్వమంటే, ఇవ్వటానికి ఎవరూ ఇష్టపడటంలేదు. పాడుకలికాలం. చావనీ బతకనీ— ఒకర్ని ఒకరు విశ్వసించరుకదా !" అన్నది.

దుర్గ వెంటనే "నేనింక ఎన్నాళ్ళు బ్రతుకుతాను అక్కా! మీరు ఏది చేయమంటే అదిచేస్తా. దాన్నిమాత్రం అగాధంలోకి తోసెయ్యకుండా మాత్రం చూస్తే చాలు అక్కా!" అన్నది.

"ఎబ్బెబ్బే! అగాధంలో ఎందుకు పడుతుంది? తండ్రి, పింతండ్రి తల్లి పెత్తల్లులకు భేదమేముంది? మేముపోనీ ఒక వేళ అలాంటివాళ్ళమే అనుకునేట్లయితే రాత్రింబగళ్ళు బెంగ పెట్టుకుని మేము ఇలాయెందుకు అవుతాం? నాకు జ్ఞానదా మాధురి ఇద్దరూఒకటే. అమ్మాయీ! జ్ఞానదా! మీఅమ్మకు కళ్ళనీళ్లు కాస్త తుడువమ్మా! కాసేపు విసురుతూ కూర్చో" అంటూ ఆమె ఒకవైపునుంచి ఆశ, విశ్వాసం కలిగించి బైటికి వెళ్ళిపోయింది.

చాలారోజులకు ఇవాళ మళ్ళీ మృత్యుమలినమైనదుర్గ ముఖంమీద ఆనందచ్ఛాయలు కన్పించాయి. కూతురిచేతిలో విసనకర్ర తీసుకుని, ఆమెతల, ముఖం నిమురుతూ స్నిగ్ధ కంఠంతో "ఇక్కడ కాస్సేపు పడుకుని నిద్రపోఅమ్మా!" అంటూ బలవంతంగా తనగుండెలమీదికి తీసుకుని "నాలాంటి దౌర్భాగ్యురాలి కడుపునపుట్టావేం తల్లి నువ్వు? ఈ వయస్సు లోనే చాకిరితో దిగుళ్ళతో శరీరాన్ని క్షీణింపచేసుకోవాల్సి వచ్చింది. పుట్టినదానివి పోనీ మగబిడ్డగానయినా యెందుకు పుట్టకపోయావ్?" అన్నది.

చాలారోజులకు తల్లి ఇవాళ ఇలాఆదరంగా మాట్లాడ టంతో జ్ఞానదా నిశ్శబ్దంగాకూర్చుని కళ్ళనీళ్లు కార్చసాగింది. కొంచెంసేపటికి ఇద్దరూ నిద్రపోయారుకాబోలు! హఠాత్తుగా తల్లి త్రోసివెయ్యటంతో జ్ఞానదా ఖంగారుగాలేచికూర్చుంది.

"అమ్మాయ్ లే, లేఅమ్మా! ఇంకెంతో వ్యవధిలేదు. నా ట్రంకుపెట్టెలో సబ్బుఒకటి ఉండాలనుకుంటాను. చటు క్కున చెరువుకువెళ్ళి కాళ్లూచేతులూ ముఖమూకడుక్కు నిరా. కాదు అమ్మాయ్! ఇదే నీలోఉన్న దోషం. చెప్పినమాట వినిపించుకోవు. చప్పునపోయి రమ్మంటూంటే?" అన్నది.

తల్లి చెప్పినప్రకారం పెట్టెతెరచి చాలా రోజులనాటి సబ్బుముక్క తీసుకుని తువాలా చేతపుచ్చుకుని విచార ముఖంతో చెరువుకు వెళ్ళింది.

తల్లి చెప్పటంమొదలెట్టింది. "కొంచెంగట్టిగా ఒకటికి రెండుసార్లు ముఖం రుద్దుకోఅమ్మాయ్! నిర్లక్ష్యం చెయ్యకు. చప్పున రావాలి - వాళ్ళంతా ఎప్పుడువస్తారో యేమో!"

చెరువునుంచి తిరిగివచ్చి జ్ఞానదా తెల్లబోయింది. మరణాసన్నురాలైన తల్లి ఈలోపుగా మంచంమీదినుంచి ఎలా లేచివెళ్ళిందో - పెట్టెదగ్గిరకువెళ్ళి అందులోంచి అద్దం చీరె ఒకటితీసి అక్కడే కూర్చునిఉంది. కూతురు రాగానే 'మరిచిపోయాను, తలదువ్వి జడవేశాను కాను, మొహం కడుక్కుని వచ్చావు - పోనీలే. కూర్చో. చప్పున తలదువ్వే స్తాను' అన్నది.

కూతురు భయపడుతూ 'నీకాళ్ళమీద పడతాను. నువ్వు దువ్వలేవు, ఓపిక లేదు నీవు, పోయిపడుకో అమ్మా! నేను దువ్వుకుంటానులే. నమస్కారాలు' నీకు అన్నది.

కూతురి మాటలువిని తల్లి ఇవాళకొంచెం' నవ్వింది. తలఊగిస్తూ "ఊం. దువ్వలేనూ? నీకు తెలుసా జ్ఞానీ! నాచేత జడ వేయించుకోవాలం. ఈవీదిలో ఆడపిల్లలంతా కట్టకట్టుకు వచ్చేవాళ్లు. తల దువ్వి జడ వెయ్యలేనూ? కాదులే, ఆలస్యం చెయ్యకు ఇంక" అంటూ బలవంతాన దగ్గిరకూర్చో పెట్టుకుని ఎంతో శ్రద్ధగా ఆప్యాయంగా స్వయంగా తలదువ్వి జడ వేసింది. ఇదే ఆమె ఆఖరు సారిగా జడ వెయ్యటం ఏమో! కాళ్లకు పారాణి పెట్టింది. నెత్తిమీదచుట్టచుట్టింది. పెదవులకు రంగు వెయ్యటం కూడా మరిచిపోలేదు. చివరకు గడ్డంపుచ్చుకొని ముఖం ఒకసారి అటూఇటూ త్రిప్పి ముద్దెట్టుకునేసరికి చటుక్కున ఆమెకీమాటస్ఫురించింది. "మా అమ్మాయి బాగుండదని ఎవరంటారు! కొంచెం నలుపు అన్నమాటేకాని, ఇంత కళగల ముఖం, కళ్లూ ఎంతమందికి ఉంటాయేమిటి మహా!" అని అనుకుంది.

ఈ సంగతి మాత్రం ఆమె గ్రహించలేక పోయింది. "ఎవరి కూతురు తల్లిని ఇలా ప్రేమించగలదు? ఎవరికి తల్లే ఇలా ప్రాణసమానురాలు కాగలదు? ఏపిల్లహృదయంలోని మాతృభక్తి, ప్రేమఇలా కురూపాన్నంతని ఆచ్ఛాదించి పైకి వెల్లి విరుస్తుంది? — ఇవన్నీ ఆమె ఆలోచించలేక పోయింది. కాని, కూతురి ఒంటిమీద ఒక్క నగ అయినా పెట్టలేక పోయానే అని ఇంతకుముందు కలిగిన విచారం మాత్రం

ఎలాగో పోగొట్టుకోగలిగింది. నగలు లేకపోవటం ఒక పెద్ద లోపంగా ఆమె కంటికి కన్పించలేదు ఇవాళ.

అప్పటికింకా చాలా టైముంది. కాని ఆమె ఇంక ఎంత ప్రయత్నించినా నిద్రపోలేక పోయింది. విచారాల నన్నిటినీ మరిచిపోయి కూతుర్ని దగ్గర పెట్టుకొని కూర్చుంది.

జ్ఞానిని చూడటానికి వస్తారని తెలిసి ప్రక్కయింటినీల కంఠుని భార్యావాళ్లూవచ్చారు.తరంగిణీ వదినకూడావచ్చింది. యథాసమయానికి కూతురునకు పిలుపువచ్చింది. వాళ్లుప్రక్క గదిలో కూర్చుని తొంగితొంగిచూస్తున్నారు. తనకు ఒక్కతే కూతురై ఉండి, దాన్ని చాటుగా తీసుకువెళ్లి ఆపరేషన్ చేస్తుంటే – తల్లి ఇవతల ఎలాంటి మనోభావనతో కూర్చుని ఉంటుందో–అలాగే దుర్గ తనమలినశయ్యమీదకూర్చునిఉంది.

వరుడు, ఈసంబంధం కుదిర్చినఅతడు అల్పాహారం అవీ తీసుకుని బైటికి వెళ్లారు. వాళ్ల బాడుగబండి, టకటక లాడుతూ–వెళ్ళిపోయింది—ఆ చప్పుడు కూడా విన్పించింది. తర్వాత తరంగిణి గదిలోకివచ్చి ఒక పెద్ద నిట్టూర్పు విడిచి "ఊహుఁ. పిల్ల నచ్చలేదట!" అని చెప్పింది.

దుర్గ కళ్ళు మూసుకుని మంచంమీద పడిపోయింది. ఒక్క ప్రశ్నకూడా అడగలేదు.

తరంగిణి జాలికనబరుస్తూ "ఇలా ఎముకలు బైటపడ్డ పిల్ల యెవరికయినా నచ్చుతుందా? దుర్గా! నే చెప్పినట్లు విని పిల్లదానికి మంచి తిండి అదీ యిస్తూ ఏదయినా టానిక్ కూడా కొన్నాళ్లు యిప్పించు. మనం చిన్నప్పటినుంచీ చూస్తూనే ఉన్నాంగా! మొదటినుంచీ యిలాగే ఉన్నదా యిది? జ్వరం

మూలంగా అస్థిపంజరం బైటపడింది. ఒక యేడాది ఓపికపట్టి పిల్లవిషయంలో శ్రద్ధవహించు, మళ్ళీ ఎలాతయారవుతుందో చూడు” అన్నది.

అది నిజమే! కాని అంతటి సుయోగం ఎక్కడిది! డబ్బుఏది అసలు? ఒకసంవత్సరం ఓపికపట్టి దానిఅస్థిపంజరాన్ని కప్పిపుచ్చటానికి వ్యవధి ఏది? పిల్లకా పది హేనోఏడు కూడా వచ్చింది. పితృపితామహాదులు ఆరోజు కారోజు నరక కూపంలో మునిగిపోతున్నారు. పెద్దకుపీనుల ఇంటిపిల్లగా ఉంచేత ఊళ్ళోవాళ్ళంతా జాతిపోతుందని రోజురోజూ కక్షైర చేస్తున్నారు. ఇంక ఓపిక పట్టాల్సిన అవసరం రవంతయినా లేదు. దాటించెయ్! పంపించెయ్! ఎలాగోఅలా ఎవరిచేతిలో పెట్టినాసరే! రేపే మళ్ళీ దానికివైధవ్యంవస్తుందని తెలిసినాసరే. అంతులేని దారిద్ర్యమూ, దుఃఖమూ కష్టాలూ కళ్ళముందు కన్పిస్తున్నాసరే! దాన్ని ఎవరికో ఒకరికి అప్పగించి జాతినీ. ధర్మాల్నీ పితృమహాదుల పారలౌకిక ప్రాణాల్నీ కాపాడు—

అప్పటి కింకా యింట్లో దీపం పెట్టనేలేదు. జ్ఞానదా ఆ చీకట్లో చాటుగా అలంకరణమంతా తీసి వేసుకోటానికై మెల్లిగా ప్రవేశించింది. దుర్గ శవంలాగా పడివుంది. ఒకక్షణం పోయాక జ్ఞానదా మహాపరాధినిలాగా నిశ్శబ్దంగా తల్లి పాదాల దగ్గిరకు వచ్చి కూర్చోవటం తల్లికి తెలిసినా ఆమె పలకరించ లేదు. తర్వాత అలాగే చాలాసేపు ఓపికవహించి, ఆకలితో బాధపడుతున్న ఆమె అలసటతో అక్కడే ముడుచుకుని పడుకుంది. ఇదంతా తెలిసినా ఆ తల్లికి ఇవాళ రవంతయినా దయ కలగలేదు.

## ౧౦

దుర్గ పరిస్థితి ఎప్పుడు ఏం జరుగుతుందో చెప్పటానికి వీల్లేకుండా ఉంది. అదీగాక ఆవీధినిఉన్న సర్వశాస్త్రవేత్తలు—పెద్దలూ చెప్పగా విన్నది—ప్రాప్తవయస్కురాలూ, అవివాహిత అయిన తన కూతురు తమ పితృపితామహాదులను ఆరోజుకారోజు అధోగతిపాలు చెయ్యటమే కాదు. తనమరణ సమయంలోకూడా ఆమె ఏమీ ఉపయోగానికి రాదుట! ఆమె చేతి నీళ్లూ, నిప్పూ రెండూ అస్పృశ్యాలే. ఈ శాస్త్రవేత్తలమాట వినేసరికి మరణోన్ముఖురాలైన ఆమె ముఖం కాస్సేపటివరకూ కాల్చినకాగితంలా అయిపోయింది.

చాలా రోజులనుంచి అవిశ్రాంతమైన అఘాతాలు సహించవలసిరావటంతో ఆమె హృదయంలోని ప్రేమ అంతరితమై పోయింది. ఇదివరకుదాకా కూతురంటే ఆమెకు ఎంతమాత్రం ప్రేమ ఉండేదో, ఇప్పుడా కూతుర్ని చూస్తే ఒళ్ళుమండిపోసాగింది ఆమెకు. ఇవాళ ఈ సంగతి తెలిసే సరికి తన పరలోక యాత్రకు కంటకప్రాయురాలైన కూతురంటే ఆమె హృదయం పాషాణంలాగా మరీకాఠిన్యాన్ని వహించింది. దయాదాక్షిణ్యాలు—వాత్సల్యం అనేవి ఏకోశానా లేకుండా పోయాయి.

అనాథుణ్ణి దగ్గరకు పిలిచి "మాడీ! ఆవీధిని ఉండే గోపాలభట్టాచార్య – ఎవరో — మళ్ళీ పెళ్ళి చేసుకుంటారని విన్నాను. నేను చనిపోయేలోపుగా మరోసారి ఆఖరి ప్రయత్నంచేసి చూస్తావా?" అన్నది.

అనాధుడు ఆమాటను విశ్వసించలేక యెగరగొట్టి, "ఎబ్బే" లేదు. గోపాలభట్టాచార్య మళ్ళీపెళ్ళి చేసుకోవటం ఏమిటి? ఎవరో నీతో తమాషాకి అని ఉంటారు వదినా ?" అన్నాడు.

దుర్గ నిట్టూర్చి "నాతో ఇంక తమాషాకి అనేవాళ్ళు, ఎవరుమరిదీ? అతడు మగవాడు అతడి యేళ్ళసంగతి ఆలోచించేదెవరు? కాదు, కాదు. ఆవయస్సులో చాలామంది చేసుకుంటున్నారు పెళ్ళిళ్ళు. నేను బ్రతిమాలుకుంటున్నాను. ఒకసారి వెళ్ళి సంగతి కాస్త తెలుసుకునిరా. బ్రతికి ఉన్నన్నాళ్ళూ ఏమీపొందలేక పోయాను. చచ్చాకయినా దాని చేతిమీదుగా అగ్ని అయినా పొందగలుగుతాను" అన్నది.

ఇప్పుడావిడకు అన్నిటికన్నా యిదే పెద్ద ఆశంకగా ఉంది. స్వయంగా తనకడుపున పుట్టినబిడ్డ, ఇన్నికష్టాల్లో కూడా యెంతో గారాబంగా తనచేత పెంచబడిన బిడ్డ— చివరకు ఇలాయెందుకూ పనికిరాకుండా బోవటమే. ఆమెచేతి మీదుగా అగ్నినయినా పొందటానికి వీల్లేనప్పుడు- యెందుకు అలాంటిపిల్ల పుట్టింది? అనేది అనుక్షణమూ ఆమె ఆలోచన.

ఆదుర్దాకొద్దీ లేచికూర్చుని, "ఎక్కడైనాసరే, ఎవరికయినాసరే, నేను బ్రతికివుండగా దాన్ని ఒకరచేతిలోపెట్టు. నా ఆశీర్వాదంవల్ల నువ్వు మహారాజు వవుతావుగా మరిదీ!" అన్నది.

ఈవిషయంలో అతడి ఆసక్తితక్కువదికాదు. అతడు ఆరోజునే గోపాలభట్టాచార్య సంగతి తెలుసుకు రావటానికి వెళ్ళి అదినిజమేనని తెలుసుకుని ఒకక్షణం స్తంభితుడయి

నాడు. కేవలం చేసుకోవటం నిజమనేకాదు — అప్పుడే ఈ లోపుగా కన్యాభారంతో అణగిపోతున్న తండ్రులు నలుగు రయిదుగురువచ్చి ఆయన్ని బ్రతిమాలి మరీ పోతున్నారట!

ఇలాంటి క్లిష్టపరిస్థితిలో పెళ్ళిఅయినా గోపాలానికే కన్యాదానం చేస్తారుటని వినగానే జ్ఞానదాకూడా ఛీ! ఛీ! అనుకుంది. అంతమాత్రానికి తల్లి మనస్సు ఏమాత్రం చలించలేదు ఆమె యిప్పుడు పరలోకయాత్రి. ఆ యాత్రకు పాథేయాన్ని శాస్త్రసమ్మతంగా యెలాగో అలా ఆమె సమకూర్చుకోవటం అత్యంతావశ్యకం.

బెంగాలీలు-ఎన్ని జన్మజన్మాంతరాలనుంచి శాస్త్రిలనే ఈ యూప స్తంభాలకు తమకన్యలను బలియిస్తూ రావటం లేదు. ఇవాళ ఆమెమాత్రం ఎందుకు వెనక్కి తగ్గుతుంది? ఇం దులో దుఃఖంలోదుఃఖం ఏమిటంటే అతను పిల్లనుచూశాక కాని చేసుకోను అని కబురుచేశాడు. ఈ పాడు దేశంలో ఆ సంప్రదాయం ఒకటి ఉందామె! నాలుగైదు సంబంధాలు చూసి, విచారించి చేసుకునే అవకాశంకూడా అఘోరించింది.

గ్రీష్మఋతువులో ఎండిఎండి ఉన్న నేల వర్షంపడగానే ఎలా ఉజ్జీవింతమవుతుందో-అలాగే ఈరవ్వంతఆశతో చచ్చి పోదామనే దుర్గకాంతు కాస్సేపు మనస్సును కలవరపరచింది. ఆమెఅనాథుడిచేతులుపట్టుకుని "మరదీ?తమ్ముడుచేయాల్సిన ఈపనికాస్తా చెయ్యి భాయీ!-ఆ దౌర్భాగ్యశాలు నాకు తల కొరివిపెట్టే అవకాశాన్నికలిగించు. ముందున్న ముహూర్తం తప్పిపోకుండాచూడు. ఇవాళేవచ్చి పిల్లనుచూసుకుని తాంబూ లాలుపుచ్చుకుని వెళ్ళమని చెప్పు వాళ్ళతో" అని బతిమాలింది.

"పెళ్ళి కాకపోతే తల్లికి అంత్యక్రియలుకూడా తాను చేయటానికి వీలుండదు. అలాచెయ్యటం శాస్త్రనిషిద్ధం-" ఈ సంగతివిని జ్ఞానదా ఆహారనిద్రాదులుకూడా మానేసింది.

ఆమె బెంగాలీపడుచు. ఆమెకూ హృదయం అవిరతంగా జ్వలించసాగింది.

అపరాహ్ణసమయంలో జ్ఞానదాఒక్కతే వంటయింట్లో కూర్చుని తల్లికి పథ్యం తయారుచేస్తోంది. సౌందర్యపరీక్ష ఇవ్వటానికై ఆమెకు మరోసారి పిలుపువచ్చింది.

స్వర్ణ స్వయంగా పరుగెత్తుకువచ్చి "ఒసేయ్! జ్ఞానీ! ఆపని అక్కడవదిలేసి చప్పునవచ్చెయ్. వాళ్ళు చూడటానికి వచ్చారు. చప్పునచీరెమాత్రంమార్చుకుని చక్కావచ్చెయ్! వాళ్ళు అలాగేచూసి వెళ్ళిపోతారుట!" అని చెప్పి ఆమెమళ్ళీ గబగబా వెళ్ళిపోయింది.

అనాథుడు అప్పటికింకా ఆఫీసునుంచి తిరిగిరాలేదు. అంచేత వాళ్ళకుతగిన మర్యాదలూ అవీ చెయ్యవలసినభారం ఆమెమీద ఉంది. చూడటానికివచ్చేది వరుడూ—అతడికి దూరపుమేనల్లుడొకడూ. అందచందాలు చిన్నవాళ్ళకు తెలిసినంతగా పెద్దవాళ్ళకు తెలియవని చెప్పి గోపాలుడు తెలివిగా ఈ మేనల్లుణ్ణి వెంటబెట్టుకునివచ్చాడు. అతడి సలహామీదనే ఎలా ఉన్నపిల్లను అలావచ్చెయ్యమని ఆదేశించాడు. ఎంచేతంటే అలంకరించుకున్నప్పుడుచూస్తే సహజంగాఉండేకొన్ని లోపాలు మరుగున పడిపోవచ్చు.

ఆ యువకుడు ఆరుగంటలరైలుకు కలకత్తా వెళ్ళిపోవాలి. అతడు తొందరచెయ్యటంమొదలెట్టాడు. స్వర్ణ మధ్యలో శిల

బడి గొంతునొక్కుకుని పిలవటం మొదలెట్టింది. అయినా జ్ఞానదా రాలేదు. ఊరికే ఒకచీర కట్టుకురావటానికి అయే ఆలస్యంకన్న ఎక్కువ ఆలశ్యం అవటంచూసి, దాసీదివెళ్ళి చెయ్యిపుచ్చుకుని లాక్కునివచ్చింది. ఆమెకేసి చూడగానే పెత్తల్లి కోపంతో తననుతాను మరచిపోయి, "అవన్నీ తీసెయ్! ఎవరుచెప్పారు ఇలా వేషం వేసుకుని రమ్మని? వెళ్ళు వెళ్ళి చప్పున తీసేసుకునిరా" అని కేకలేసింది.

చూడటానికి వచ్చినవాళు హఠాత్తుగా ఈ కేకలువిని ఆశ్చర్యపోతూ మెడలు ముందుకుచాచి చూచారు. ఆ యువకుడు ఈ వ్యవహారం తెలుసుకుని "పోనీ అలాగేరమ్మనండి. మేమింక ఆలశ్యంచేశేందుకు వ్యవధిలేదు" అన్నాడు.

దాసీది జ్ఞానదాని తీసుకువచ్చి ఎదురుగా నిలబెట్టేసరికి అపరూపమైన ఆమె అలంకరణాన్నిచూసి, ఆ యువకుడు అతి కష్టంమీద నవ్వునాపుకుని లేచి నిలబడి "రేపు కబురు చేస్తాం ఏసంగతీ" అనిచెప్పి మేనమామను వెంటబెట్టుకుని బయలుదేరాడు. అల్పాహారపు ఏర్పాట్లూ అవీ చేశారుకాని రైలు అందదేమో అన్నభయంతో వాటిని స్పృశించటానికి కూడా వీల్లేక పోయిందివారికి.

'రేపు కబురుచేస్తాం' అన్నమాటకు అర్థం వేమిటో అందరూ గ్రహించారు. పెత్తల్లి తిట్లతో, కేకల్తో వాడ వాడంతా ఏకమయ్యేటంత హంగామాచేసింది. దుర్గ పరిస్థితి విషమించింది కాబోలు అని అనుకుని ఇరుగుపొరుగువాళ్ళు వలుగురయిదుగురు పరుగెత్తుకు వచ్చారు. సరిగ్గా ఆ సమయానికే అతులుడుకూడా ఎక్కడినుంచో వచ్చి ఊడిపడ్డాడు.

అతడూ ఆరుగంటల రైలుకు కలకత్తా వెడుతున్నాడు. సగం దారిలో ఈ కేక విని, అతడూ ఇలాగే శంకించి ఇంట్లోకి వచ్చాడు.

అతులుడు కంటపడేసరికి స్వర్ణ రోషం నూరురెట్లూ, క్షోభ వెయ్యిరెట్లూ పెరిగింది విశీర్ణము, సంకుచితమూ, క్షయంమూలంగా మృతప్రాయమూ అయిన జ్ఞానదా ముఖం బలవంతాన చేత్తో పైకెత్తి అతులుడికి చూపుతూ 'చూడు అతుల్! ఒక్కసారి కళ్ళనిండా చూడు. దౌర్భాగ్యురాలైన ఈకోతిముఖం చూడు ఒకసారి' అన్నది.

వాస్తవానికి ఆమె ముఖంకేసి చూస్తే నవ్వు ఆపుకోవటం కష్టమే. ఆమె పెదవులకు వేసుకునే రంగును చెక్కిళ్ళకూ — చెక్కిళ్ళరంగును పెదవులకూ వేసుకుని, చీకట్లో ఆదరాబాదరా పిచ్చిపిచ్చిగా తలదువ్వుకుని నడినెత్తిన చుట్ట చుట్టుకుంది. దుబ్బు రేగిఉన్న జుట్టుమీద ఒకసీసాడు నూనే కుమ్మరించి తలదువ్వుకుంది కాబోలు చివళ్లనుంచి నూనె కారుతోంది ఇంకా

ఒకరిద్దరు ఆడపిల్లలుచూసి నవ్వుకుంటూ ప్రక్కనుంచి వెళ్లారు.

కాని అతులుడిహృదయం తప్తశలాకగ్రుచ్చినట్లు బాధపడసాగింది. ఇలా పట్టపగలు అతడు జ్ఞానదా ముఖంచూసి ఎన్నాళ్ళో అయింది. జబ్బుపడి అసహ్యంగా తయారయిందని వాళ్ళూ వాళ్ళూ చెప్పగా వినటమే అతడు.

కాని ఆమె ఇంతగాచిక్కి శల్యమైందని అతడు కలలో కూడా అనుకోలేదు. తాను అంటువ్యాధితో మరణోన్ము

ఖుడై ఉన్నప్పుడు ఒకప్పుడు అతడు ఈముఖాన్నే ప్రేమిం చాడు. నిష్కపటంగా హృదయపూర్వకంగా ప్రేమించాడు. ఆముఖం మీదనే నేడు యమధర్మరాజు డిక్రీజారీచేసి ఆఖరి నోటీసు అంటించినట్లుండటం అతడు హఠాత్తుగా చూసి. ఒక్క నిమిషంపాటు ఆత్మవిస్మృతు డయినాడు. ఏదో అన బోయాడు కాని, స్వర్ణకేకలకి ఆమాటలు అడుగున పడి పోయాయి.

'ఆఁ! బోగంబానిలాగా సిగ్గుమాలినతనం చూపుతావా? అసలే చావుకు సిద్ధమయిన నడపీనుగు. అతగాడి మనస్సు భ్రమింపచెయ్యటానికి ఈవేషం తీస్కుకునివచ్చావా? కాని చెయ్యగలిగావా పోనీ ఆ పని? మొహాన చెప్పుచ్చుకు కొట్టి నట్టు వెళ్ళిపోయాడు" అన్నది స్వర్ణ.

"ఎవరు ఇలా భూతానికిమల్లే అలంకరించిరిది. పెద్దా విడా! ముసిలాడికి నచ్చలేదల్లే ఉందే?" అని అడిగింది ఎవరో ఒకావిడ.

స్వర్ణ తర్జనితో ఆమెనేచూపుతూ "ఇంకెవరు అలంక రించారు? తానే అలంకరించుకుంది. తల్లియేమో అజ్ఞానంగా చైతన్యం లేకుండా పడిఉన్నదాయె! ఒక్కచీరమాత్రం కట్టు కుని రావే అని చెప్పాను ఆమాట నచ్చలేదు. అలంకరణ చేసుకోకుండావెడితే ముసిలాడ్ని ఆకర్షించలేనేమో అను కుంది. పైగా అది అయినా ఏమిటి? అద్దకంచీరె ఒకటి కట్టు కుని, అతులుడు యిచ్చిన గాజులు వేసుకుంది. వాటిని పది సార్లు తీసి పదిసార్లు తొడుక్కుంది రోజు మొత్తంమీద. పాడు మొహం దానికి ఆ గాజులు తొడుక్కుని బైటికి రావటానికి

సిగ్గు ఎలా లేకపోయిందో! వెళ్ళు నాయెదుటనుంచి ఫో" అన్నది.

సిగ్గుమాలిన ఆ పిల్లదాని ఈ చరిత్ర యావత్తూ అందరూ తర్కించుకుని ఛీ ఛీ! అనుకుంటూ వెళ్ళిపోయారు. కాని ఎవరి దగ్గరయితే ఏది అజ్ఞాతంగా ఉండదో ఆ అంతర్యామి కళ్ళలోంచిమాత్రం బహుశా రెండు కన్నీటిచుక్కలు రాలి ఉండవచ్చు. ఆ పిల్లది చిన్నప్పటినుంచీకూడా ఎన్నడూ సిగ్గుమాలంగా తల ఎత్తి మాట్లాడనయినా మాట్లాడదని ఆయనకు తెలుసు. అలాంటి ఆమె ఇవాళ ఆసిగ్గునంతా కాలరాచి, స్వాస్థ్యహీనమూ శ్రీవిహీనమూ అయిన తన శరీరాన్ని స్వయంగా అలంకరించుకునివచ్చి ఈ అతివృద్ధునిపాదాలదగ్గిర ఆత్మ విక్రయం చేసుకోబోయింది? కాని విక్రయంజరగలేదు - లోపం బైటపడింది. ఇవాళ వాళ్ళంతా ఛీ! ఛీ! అని తిట్టిపోయారు—కాని క్షమించలేదు.

సర్వదా హృదయాలలో నివసిస్తూ సర్వాలనూ విచారించే పరమాత్మ బహుశా ఈ దురదృష్టవంతురాలి అపరాధాల్ని తన తిరుహస్తాలతో స్వీకరించి ఉండవచ్చు.

జ్ఞానదా లేచి నిలబడింది. ఆమె ఇతరుల యెదుట ఎన్నడూ ఏడ్చి ఎరుగదు-కాని ఇవాళ అతులుడియెదుట ఆమె కళ్ళలోనుంచి కనీళ్ళుజారసాగాయి. అయినా ఒక్కమాటకయినా సంజాయిషీ ఇవ్వలేదు—ఎవరి ముఖంకేసీ కన్నెత్తి చూడనూలేదు. నిశ్శబ్దంగా కళ్ళు తుడుచుకుంటూ వెళ్ళిపోయింది.

కలకత్తా వెళ్ళేందుకు మరో రైలు లేకపోవటం మూలంగా అతులుడు ప్రొద్దుక్రుం కేసరికి ఇంటికి తిరిగివెళ్ళాడు. దారిలో అన్ని మాటలూ అలాఉంచి ఆరోజున చివరకు చిన్న అత్త అని వెళ్ళినమాటలే మాటిమాటికీ జ్ఞాపకం రాసాగాయి. ఆరోజున ఆవిడ పుట్టింటికి వెళ్ళబోయేముందు అతుల్ని చాటుకు పిలిచి, "అతుల్ ! వజ్రాన్ని జారవిడుచుకుని గాజుముక్కను కొంగుకు ముడివేసుకునే వాళ్ళకు కలిగే మన స్తాపానికి అంతు ఉండదు నాయనా!" అని చెప్పింది ఆరోజున ఆమాటను సరిగ్గా అర్థం చేసుకోలేకపోయాడు. ఆమాట తనను ఉద్దేశించి అన్నదే అని ఇవాళ నిస్సంశయముగా తెలుసుకో గలిగాడు. సిగ్గులేనిదని ఇవాళ అందరూ ఎవర్నైతే చీవాట్లు పెట్టిపోయారో ఆమె సిగ్గువిడియాలకు హద్దుఎక్కడో అది కూడా జ్ఞాపకంవచ్చింది యివాళ అతడికి.

అప్పటికింకా తెల్లవారలేదు—చిన్నవదినను దహనం చెయ్యాలనిపిలుస్తూ వచ్చాడు అనాథుడు.

"పదండి, వెడదాం" అతులుడు బైటికివచ్చాడు. వచ్చి వర్ణంక్రితం తులసీవేదికముందు తండ్రిపాదాలను ఒళ్ళోపెట్టుకుని ఎలాకూర్చుందో, అలాగే జ్ఞానదా ఇవాళ తల్లిపాదాలు రెండూ ఒళ్ళోపెట్టుకుని కూర్చునిఉండటం చూశాడు. కేవలం ఒక్కసారితప్ప ఆమె ఎన్నడూ చంచలురాలుకాగా ఎవ్వరూ చూసి యెరుగరు - అది అతులుడి పాదాలమీదవ్రాలి తల బాదుకోవటమే. అంచేత ఆమె యివాళ యింత నిశ్శబ్దం వహించటంవల్ల ఎవరూ ఏమీ అనుకోలేదు. ఇరుగుపొరుగు వారంతా ఆమె దహనసంస్కారాల ప్రయత్నాల్లో ఉన్నారు.

యథాసమయానికి ఆమె మృతదేహాన్ని స్మశానానికి బయలుదేరతీశారు వాళ్లు. అందరివెనుకా జ్ఞానదాకూడా వెళ్ళింది పేదవాళ్ళపిల్ల అవటంమూలంగా యిరుగుపొరుగు స్త్రీలెవరూ ఆమెకుతోడు రాలేదు! వర్షాలతోనిండిన గంగా నది స్మశానాలకి ఆనుకుని వేగంగా ప్రవహిస్తోంది. తల్లికి అంత్యక్రియలు కూతురు నిశ్శబ్దంగా నిర్వర్తించింది. చితి బాగా అంటుకుని మంటలు పైకిలేవటం మొదలెట్టాక జ్ఞానదా మగవాళ్ళలోనించి ఈవలికివచ్చి గంగానది చేరువగా ప్రవాహం ప్రక్కనే కూర్చుంది. ఎవళ్ళూ వద్దుఅనలేదు. అలాఅనవలసినంతకారణమూ ఏమీ కన్పించలేదు. పైగా అతిభయంకరమైన ఈశోకదృశ్యాన్నుంచి కనుమరుగు అవుదామనే ఆమె అలా వెళ్ళిందనిఅనుకుని అందరూ సానుభూతితో "అయ్యో పాపం!" అని నిట్టూర్పు విడవసాగారు.

మొదటినుంచీ శాంతస్వభావురాలు, పరమసహిష్ణువూ అయిన ఈమె ఏం అఘాయిత్యంచేస్తుందో అన్న భయం ఎవరికీ లేదు. అతులుడికీ లేదు. అయినా ఆమె ప్రవాహవేగానికి మరీ దగ్గిరిగావెళ్ళి కూర్చోటం చూసేసరికి అతడికి హృదయంలో ఏమిటో గుబులు పుట్టుకురాసాగింది. "అలా కూర్చోవద్దు" అని వారిద్దామా అనుకున్నాడు ఒకసారి. పోనీ దగ్గరకువెళ్ళి నుంచుందామా అనుకున్నాడు మరోసారి. సిగ్గు, సంకోచాలవల్ల ఏదీ చెయ్యలేకపోయాడు.

అగ్ని వేడికి దూరంగాపోయి అందరూ ఎక్కడయితే కూర్చున్నారోఅతులుడుకూడా అక్కడికేవెళ్ళికూర్చున్నాడు.

ఎదురుగా ప్రజ్వలిస్తున్న చితికేసి చూచేసరికి అతడిమనస్సుకు బహు పురాతనమైన ఈప్రశ్నే మళ్ళీతట్టింది. "నిన్న ఏదయితే ఉన్నదో అది ఇవాళలేదు. ఇవాళఉన్న ఈనశ్వరదేహంకూడ మెల్లమెల్లిగా భస్మం అయిపోతుంది. ఇంక దాన్ని గుర్తించటానికికూడా వీలుఉండదు. కాని అలాంటి శరీరాన్నే ఆధారంగాచేసుకుని, ఎన్నిఆశలూ, ఎన్నిఅశాంతులు, ఎంతభయం ఎన్నిదిగుళ్ళూఉన్నాయి! అవన్నీ ఏమయిపోయాయి ఇప్పుడు! ఒక్కనిమిషంలో ఎక్కడ అంతర్హితమైపోయాయి? అయితే ఇహ ఏమిటి వాటివిలువ? చస్తే ఎంతసేపు పడుతుంది?

హఠాత్తుగా అతడికి తన గడచిన జీవితం కళ్ళయెదుట కన్పించసాగింది. మూడేళ్ళక్రితం తానూ చావటానికి సిద్ధమయినాడు. కాని చావలేదు. అతడికి తెలియకుండానే అతడి దృష్టి చితికాలూకు ధూమధూసరితమైన యవనికనుభేదించుకుని ఎక్కడివరకోపోయింది. ఆరోజున తనను చావనీయకుండా రక్షించింది ఆమేనని జ్ఞాపకంవచ్చింది. ఆమె ఇప్పుడు ఇదిగో స్వచ్ఛమైన జాహ్నవీజలంలో నీడపడేటట్లుగా ఆకృతిధరించిన శోకదేవతలాగా కూర్చునిఉంది. దుబ్బురేగిన జుట్టూ, మాసిపోయిన చీరచెంగూమాత్రం గాలికి కదులుతున్నాయి.

అతడినేత్రాలు రెండూ అశ్రుపూరితము లయినాయి. మనస్సులో అనుకోసాగాడు. "ఛీ! పాడుసౌందర్యం! రూపానికి ఇంతవిలువే ఉంటే మూడు సంవత్సరాలక్రితం అందంతాలూకు మార్కెట్‌లో తాను దివాలా తీయవలసివచ్చింది.

ఆనాడు అత్యంతాత్మీయులుకూడా అసహ్యంతో తనమొహం కేసికూడా చూడలేక పోయారు.

సమయంఎలాగడిచిపోతున్నదో అతడికి ఆ దృష్టిలేదు. చితిఎప్పుడు ఆరిపోయిందో అదీ చూడలేదు అతడు. అను క్షణమూ అతడిదృష్టి యానత్తూ అనిశ్చలప్రతిమ మీదనే ఆబద్ధమై ఉండిపోయింది.

'ఇంకా కూర్చోటం ఎందుకు నాయనా? రా, చివరి తతంగంకాస్తా పూర్తిచేసేద్దాం' అన్నాడుఅనాథుడు. 'పదండి' అంటూ అపరాహ్ణవేళను కల చెరిగిపోయి లేచి నుంచున్నాడు అతులుడు.

అప్పుడిహ సూర్యుడు అస్తమిస్తున్నాడు. ఆ మసక వెలుతురులో ప్రకాశవంతంగాఉన్న రేవుఒడ్డున కొట్టి పడేసి ఉన్న గాజుముక్కలమీదికి పోయింది అతడిదృష్టి. అవి తాను ఇచ్చిన అతివిలువైన సామాన్యపు అలంకారాలు. నూరు తిట్టినా వెయ్యి చీవాట్లుపెట్టినా జ్ఞానదా ఆగాజులమీది మమ కారాన్ని పోగొట్టుకో లేకపోయింది. ఇవాళ వాటినిస్వయంగా పగులకొట్టిపారేసి సంజాయిషీ యిచ్చింది. అతులుడు గబ గబా ముందుకువచ్చి, ఆ ముక్కలను ఆప్యాయంగా పోగు చేసి తీసుకున్నాడు.

అవి పగిలిపోకుండా ఉన్నప్పుడు తాను వాటి మర్యాదను కాపాడలేకపోయాడు. ఇవాళ అవి పగిలిపోయిన చిన్న

గాజుముక్కలయినా అతడికవి అమూల్యవస్తువులుగా కన్పించ
సాగాయి.

వెనకాల అడుగుల చప్పుడు విని జ్ఞానదా ముఖం
వెనిక్కి త్రిప్పిచూసింది. ఆదృష్టి భరించలేకపోయాడు అతు
లుడు. ఆమె చేతులు పట్టుకోపోయాడనుకుంటూ, ఒకసారి.
కాని తనను తాను సంబాళించుకుని, 'పొరపాట్లు అందరివల్లా
వస్తాయి జ్ఞానదా! కాని-' అంటూ అతడు గుప్పిట తెరవ
గానే సాయంకాలపు అరుణకాంతులు ఆగాజు ముక్కలమీాద
పడి అవి ధగధగలాడి పోయాయి.

'ఇవాళ నువ్వు వేటి నయితే ఇక్కడ పగలగొట్టి
పారేసి పోదామని వచ్చావో నేను వాటినే మళ్ళీ ఏరుకుని
తీసుకుపోదామని వచ్చాను' అన్నాడు.

ఆ మాటల్లోనిభావం జ్ఞానదా గ్రహించలేక పోయింది.
అంచేత నిబిడ శోకావ్యక్తమైన ఉదాసీనదృష్టి అతులుడిముఖం
మీాద పరపి చాలారోజులకు ఇవాళ మళ్ళీ మృదువుగా
"ఎందుకు?" అని అడిగింది జ్ఞానదా.

జవాబు చెప్పబోయేసరికి అతులుడినేత్రాలు హఠా
త్తుగా అశ్రుపూరితములయినాయి. కాని అశ్రువులను అప్ప
ళించుకుని, ఇవాళ చిన్నత్త చితిజ్వాలల్లోంచి నేను ఒకవస్తు

వును స్పష్టంగా చూడగలిగాను తెలుసా ? విరిగిపోనివి. ఏవయితే ఉన్నాయో వాటిని బలవంతంగా విరగకొట్టలేము. బలవంతంగా గాజులను పగలగొట్టవచ్చు. కాని నేను అయిష్టంగానే ఉంది. దాన్ని భగ్నంచేసేశక్తి నీకూ, నాకూ ఎవరికీ లేదు. నేను చేయగలిగినది, నువ్వు చేయలేకపోయావని నిశ్చయంగా తెలుసుకున్నాను కనుకనే, పగిలిపోయినగాజులనుతీసుకుని హృదయానికిహత్తుకుని ఇంటికి వెడుతున్నాను' అన్నాడు.

జ్ఞానదా చైతన్యంలేని దానిలాగా రెప్పవాల్చకుండా చూస్తూనిలబడిపోయింది. అతులుడు చటుక్కున రెండుచేతులూ చాచి, ఆమె కుడిచేతిని తనచేతుల్లోకి తీసుకున్నాడు. కాని జ్ఞానదామాత్రం శిలాప్రతిమలాగా అలాగే కదలకుండా నుంచుంది అతులుడు ఒక్కక్షణం నిశ్శబ్దంగా ఊరుకుని, గద్గదకంఠంతో "నా పాపాలకన్నిటికీ ఎంతటిశిక్షనైనా ఎవరైనా విధిస్తే విధించనీ. కానీ నువ్వు విధించటానికి ప్రయత్నించకు జ్ఞానీ! నేను ఎంతటి అపరాధాన్నయినా చేసిఉండనీ నువ్వు నన్ను పరిగ్రహించక తప్పదు. నన్నుత్యజించి శాస్తి చేయాలనే వాంఛ నీ కేమాత్రంలేదు" అన్నాడు. అప్పటి వరకూ జ్ఞానదా తలవంచుకునేఉంది. కాని ఆమెకు నోట వెంటమాట పెకిలిరాలేదు. దుర్బలమయిన ఆమె చెయ్యి

మాత్రం అతులాడిచేతులో ఒకసారి కంపించింది. కొన్ని క్షణాలపాటు ఉభయులూ అలాగే స్తబ్ధుల్లాగా ఉండిపోయారు అతులుడు ఆమెచేతిని ఇహ మెల్లిగా జారవిడిచి 'ఇంటికి పోదాం పద, వాళ్ళంతా చాలాదూరం సాగిపోయారు" అన్నాడు.

•